# హార్లిక్స్

Horlicks

THE IDEAL FOOD DRINK

## ఆరోజుకు ఆరోజు రోగనివారణ శక్తిని పెంచి ఆరోగ్యాన్ని కాపాడే పౌష్టికాహారం.

హార్లిక్స్ నిత్యం సేవించినట్టయితే, మీ కుటుంబానికి రోగాలు రాకుండాతట్టుకునే శక్తి పెరుగుతుంది. వారికి సంపూర్ణ-మయిన ఆరోగ్యం చేకురుతుంది. ఆరోగ్యం మహాభాగ్యం.

హార్లిక్స్, ప్రపంచం అంతటా డాక్టర్లు సిఫార్సు చేసేది ఇది ఒక్కటే, మీకు అత్యధికంగా పుష్టి ఇచ్చేది ఇది ఒక్కటే ఎందుచేతనంటే ఇందులోను సంపన్నమయిన స్వచ్ఛమయిన పదార్థలు; అపూర్వమయిన హార్లిక్స్ పద్ధతి ప్రకారం సమ్మిళితమితాయి. దీనివల్ల వీటి సహజ సద్గుణాలు నష్టంకావు. అవి సులువుగా జీర్ణం అవుతాయి.
అందువల్లనే సుచిత్ర హార్లిక్స్‌ని తన కుటుంబ జీవితంలో భాగంగా చేసుకుంది.

సుచిత్ర మోస్తరుగానే మీరుకూడా మీకుటుంబానికి ప్రతిరోజు హార్లిక్స్ ఇవ్వండి వారు ఆరోగ్యంగా, బలంగా పెరగడం మీకు కనబడుతుంది.

"హార్లిక్స్ ప్రధానమయిన పుష్టి సాధనం. మీకుటుంబంలోనివారికి వ్యాధులు రాకుండా తట్టుకునే శక్తి పెరిగేందుకూ వారు ఆరోజుకారోజు ఆరోగ్యంగా, చురుగ్గా ఉండేందుకూ నేను హార్లిక్స్‌ను సిఫారుసు చేస్తున్నాను"



Hx1648·TAL

## హార్లిక్స్ మంచి పుష్టికరమైనది

హార్లిక్స్ రిజిష్టర్డ్ ట్రేడ్ మార్క్.

# పాండ్స్ వానిషింగ్ క్రీమ్

## చక్కని నున్నని ముఖవర్ఛస్సుకి మాటనిస్తుంది...మీరు ఎల్లావాడినాసరే

**ఫేస్‌పౌడర్‌కి వాడండి**
(ఫేస్ పౌడర్‌కి మంచి ఆధారము)

**ప్రత్యేకంగా దానికదే వాడండి**
(కంటికి అగపించని ఒకరకం సింగారము)




ఫేస్ పౌడర్‌కి ఆధారంగా వాడవచ్చు. ఫేస్ పౌడర్‌ని అతిమృదువుగా సరిసమంగా అద్దిజేసి మీ సింగారాన్ని గంటలకొద్దీ చెక్కు చెదరకుండా వుంచుతుంది.
లేదా దానికదే ప్రత్యేకంగా వాడవచ్చు మీకో రమ్యమైన ముఖవర్ఛస్సునిస్తుంది రోజంతా మృదువైన ఛాయతో ముఖములు మెత్తదనాన్ని ఇస్తుంది.
ఎందుకంటే ఇది చెమటపట్టనీయదు.
ఇంతకంటే ఏం కావాలి మీ ముఖానికి మంచి చక్కదనాన్ని తాజాకాంతిని ఇస్తుంది... నిష్కళంకం చేస్తుంది ముఖాన్ని

Pond's

**పాండ్స్ వానిషింగ్ క్రీమ్**
**రోజంతా అందంగా వుంచే రక్ష**

CP-1500

ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు.
[1938–1972]
శుక్రవారం · 9–9–'77
పింగళనామ సం. శ్రావణ బ ఏకాదశి
సంపుటము 70 సంచిక 54
సంపాదకుడు .
శివలెంక రాధాకృష్ణ

★

పోస్టులో ఏడాది చందా రు 41-60
ఆరు మాసాలచందా రు. 20–80
విడిప్రతి వెల 75 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ–520 003


విషయానుక్రమణిక

ముఖచిత్రం: నటి, నర్తకి జయమాలిని

కథలు : సీరియల్ కథలు .



వ్యాసాలు, శీర్షికలు :

అది ఓ బల్బ్.

అది కాంతి నిస్తుంది.

అది ప్రకాశవంత
మైన కాంతి నిస్తుంది.



అది చిరకాలం మన్నుతుంది.

అది హెచ్.ఎమ్.టి.
విశిష్టతకూ, నమ్మకకూ మారు పేరన్న మాట.



హెచ్.ఎమ్.టి. **hmt**
బల్బ్‌లు–మాజీవితంలో వెలుగులు.

Rediffusion/HMT/542 Tel.

## లోకం పోకడ - డామెన్

వివాహితుడినైనా కూడా నేను నిన్ను ప్రేమిస్తాను!

ఏమిటమ్మా నీ ఎత్తుగడ?

కూలద్రోసే ప్రయత్నం!



జనతా మహాత్మ్యంతో మాజీ నియంత ?

రాష్ట్రపతిగా నీలం సంజీవరెడ్డిగారు చాలా ఆడంబరాలు వదిలేస్తామన్నారు— తెనుగువాడైన ప్రతివాడు యిది విని కాల రెత్తుకోవచ్చును— రాష్ట్రపతిని భరించడానికి యీ గడచిన పాలిక సంవత్సరాల కాలానికి 25 కోట్లకు మించిన ఖర్చు అయ్యుండాలి. ఎందుకంటే ఒక అంచనా ప్రకారం 'రాష్ట్రపతికోసం ప్రభుత్వంచేసే వ్యయం ఏడాదికి రెండుకోట్ల రూపాయలు— బ్రిటిష్ రాణిగారిని భరించడానికి ఇంగ్లాండు ఖజానాకి ఏటా ఒక కోటి 80 లక్షల రూపాయలు మాత్రమే లవుతోందిట

' ఇంత ఖర్చు రాష్ట్రపతి పదవిలో వున్న వారిక్రింద ఖర్చు అవుతుందనుకో కూడదు రాష్ట్రపతి సంస్థానాన్ని వారి రాజసాన్ని రాజప్రసాదాలను నిర్వహించడం కోసం యీ ఖర్చు అంతా అవుతున్నది—

రాష్ట్రపతిగారి ''సంస్థానం''లో ఢిల్లీ లోని రాష్ట్రపతి భవన్ మాత్రమే గాక హైద్రాబాద్‌లో కూడా ఒకపెద్ద ప్రాసాదం వుంది. సిమ్లాలో కూడా మరో రాజ ప్రాసాదం వుంది.

ఢిల్లీ రాష్ట్రపతి భవనం దాని ఆవరణ 350 ఎకరాల సువిశాలమైనవి అందులో 340 గదులున్నాయి. ఈ మొత్తం భవనాన్ని యిందులో పనిచేసే వెయ్యిమందికి జీతాలు యివ్వటానికి మాత్రమే ఏడాదికి రూ. 70 లక్షల ఖర్చు అవుతుంది

రాష్ట్రపతిగా శ్రీ రెడ్డిగారు మాత్రం రు. 10 వేల తన జీతంలో 3 వేలు మాత్రం తీసుకుంటామని ప్రకటించారు — ఈ పదవిని అలంకరించిన నాయకులంతా నిరాడంబరులు— త్యాగధనులు అనుమానం లేదు. వారికోసం గాక ఈ ''పదవి ఫటా

# ● 'రాష్ట్రపతిని భరించడానికి ఏటా రెండుకోట్ల వ్యయమా ?
# ● జనతా ''అరెస్టుల పర్వం'' ప్రారంభం ?
# ● '77 మహాత్మాతో '76 నియంత సమాలోచనలు ?

టోపం'' కోసమే యీవ్యయం అంతా ప్రజలు భరిస్తున్నారని సులువుగా అర్థం చేసుకోవచ్చును రాష్ట్రపతి భవనం నిర్వహణకు 50 మంది గెజిటెడ్ అధికారులు సహా 100 మంది అటెండర్ల దాకా అన్నిరకాల వుద్యోగులూ వున్నారు 300 మంది తోట మాలీలు 16 ఎకరాలలో వున్న మొగలాయి పూల తోటలను పోషిస్తారుట !

దీన్నిబట్టి యిదంతా బ్రిటిష్ 'వైస్రాయి'ల తంతులోనే వుందని అనిపించుతుంది ఎవరికైనా ! అంచేతనే శ్రీ సంజీవ రెడ్డి గారిని ''ఆడంబరాల కోత''కు పూనుకున్నందుకు సామాన్యుడు హర్షిస్తాడు ! .. ఇది ఎంత తొందరగా జరిగితే అంత మంచిది ఎందుకంటే రాష్ట్రపతి పదవి రాజముద్ర లాంటిది మాత్రమే !

## అప 'యశస్' పాల్

కేంద్రంలో జనతా గవర్నమెంటు వచ్చిన తర్వాత మొట్టమొదటి ఆగస్టు 15– పండుగని జనతాపార్టీ జ్ఞాపకం వుంచుకోడానికి వీలుగా, తెల్లారేసరికి సి. బి. ఐ వారు కాంగ్రెసు మాజీ పెట్రోలియం మంత్రి పి సి. సేథీని, ఎం పీ. యశ్‌పాల్ కపూర్‌ని, మాజీ ప్రధానమంత్రి మాజీ అదనపు అంతరంగిక కార్యదర్శి ఐన ఆర్. కె ధావన్‌ని, ఆయన సోదరుడు, తండ్రి, అనుయాయులు సహా సుమారు ''ఆరుకోట్ల రూపాయిల పార్టీ నిధుల కుంభకోణం'' లో భాగస్వాములుగా అరెస్ట్ చేశారు.. ప్రధానిగా మొరార్జీభాయ్‌గారు తన తొలి ఎర్రకోట ప్రసంగంలో 1947 ఆగస్టు–15 న శ్రీ జవహర్‌లాల్‌నెహ్రూ జాతీయ పతాకను ఎగరేసిన విషయాన్ని ప్రస్తావించి దరిమిలా చరిత్రను పరామర్శించి హరిజనులమీద అత్యాచారాలకు అంతిమ దశ తీసుకువస్తామని యిచ్చిన హామీకన్నముందు యీ ''అరెస్టుల వార్త''లు ''వైరులు'' లేకుండా యిక్కడా అక్కడా అంతటా వేడి పుట్టించాయి!– ఇంకా మరికొన్ని అరెస్టులు తప్పకుండ వుంటాయి! ఇది ప్రారంభం అంతే.

# సామాన్యుని సణుగుడు

## ''ఆల్ ఇన్ ది గేమ్''

'యమర్జన్సీని పెట్టి అందులో దమన నీతిని అమలు చేయకుండా శ్రీమతి గాంధీ వోడిపోయి వుంటే? ప్రజాస్వామిక దేశం అయిన మన దేశంలో ఆమె తిరిగి రాజకీయాలలోకి రావొచ్చా? రాకూడదా? అన్న మీమాంస యింతమందికి వచ్చేదా? రాదు– రాకూడదు కదా!

ఆమె ''అధికారాన్ని'' యిదివరకు ఎవ్వర్తూ ''జుర్రు'' కోలేనంతగా జుర్రుకున్న స్త్రీ మూర్తి– 'డిక్టేటర్' అన్నారు ఎందరో .

'డిక్టేటర్'ల చరిత్ర చాలామందికి తెలుసు– వీళ్లు విజయాన్ని అనుభవించి నంత స్థిర చిత్తంతో వోటమిని స్వీకరించ లేరు . నాశనానికి, ఆత్మనాశనానికి పూను కుంటారు– కాని శ్రీమతి గాంధీ– ''ఇట్స్ ఆల్ యిన్ ది గేమ్'' అన్నట్లు– అంతటి మహోన్నత పదం నుంచి పెద్ద పాము మింగేసినట్లుగా దిగజారికూడా నిబ్బరంగా, మొండిగా– తన ''కళంకాన్ని'' కాకపోయినా ''కాంగ్రెసు పార్టీకి వచ్చిన కళంకాన్నైనా'' తుడిచేస్తానంటూ మొట్టమొదట ''బీహార్'' కే బయలు దేరింది! ఆమె ''యిండిపెడెన్స్ డే'' ముందు రోజున– (గజారోహణోత్సవం కాదు)– వరదలమధ్య నుంచి ఏనుగెక్కి 12 మైళ్ళ దూరం 'దుర్భర'మైన యాత్రచేసి ''బెల్చి''కి వెళ్ళి అత్యాచారాలకు గురయిన హరిజనులన వోదార్చి వచ్చింది!...



అప యశస్సుపాలైన కపూర్

'ఇందిరా హటావో' ఉద్యమం బీహార్‌లో ప్రారంభమైంది ఇది అందరికీ తెల్సు. శ్రీమతి యిందిర తిరిగి అక్కడ నుంచె తన ప్రజా యాత్ర మొదలెట్టింది! పైగా తన ''పతనానికి'' వ్యక్తిగతంగా కంకణం కట్టుకున్న 1977 జనతా ''మహాత్మ జైప్రకాశ్ నారాయణ్'' తోనే సమాలోచనలు చేసింది

పాట్నాలో జైప్రకాశ్ గారింటికి ఆమె వెళ్ళే త్రోవలో వందలాది పిల్లలు స్త్రీలు బారులు తీరి నిలబడ్డారట !

అక్కడ ఆమెకు గుంపులు గుంపులుగా ''కామిరామన్'' ''టెలివిషన్ కామిరామన్'' కూడా స్వాగతం చెప్పారు పెద్ద సంచలనం ఆమె ఏంచేసినా

శ్రీ జైప్రకాశ్ నారాయణ్ ''నేను ఆమెకు నా శుభాకాంక్షలందించాను .. గతంలో ఆమె అనుభవించిన దానికన్నా ''ఎక్కువ వెలుగైన'' భవిష్యత్తు ఆమెకు ఆకాంక్షించాను ..'' అని ప్రకటించారు శ్రీమతి గాంధీని మేడమెట్లుదాకా దిగబెట్టి ''నేను (అనారోగ్య కారణాన) క్రిందకు రాలేను'' అంటూ వీడ్కోలు చెప్తుతూంటే తన రెండు చేతులూ జోడించి ''చాచాజీ! నమస్కార్ !''– అంటూ శ్రీమతి యిందిర సెలవు తీసుకుంది !





తా॥ కా॥ ఆగస్టు 23 మధ్యాహ్నం 3-00 గంటలకి మాజీ 'భ'క్షణ మంత్రి శ్రీ బన్సీలాల్‌ని కూడా అరెస్టు చేశారన్న వార్త ముసురు పట్టినవాతావరణంలో ఫెళ్లునఎండ కాసినట్లు వెలువడింది! వివరాలంద డానికి ముందే ఇదవ్వుయిపోయింది!

ఇప్పుడు అధికార పక్షం "చిరుతపులి మచ్చలు కడుక్కొనే యత్నంగా" ఆమె యీ పర్యటనను అభివర్ణించి నా— ప్రజాస్వామ్య దేశంలో ప్రజా సమ్మతితో ఆమెకు కూడా రాజకీయ సోపానా లను ఎక్కే హక్కు వున్నదా? లేదా? అన్న ప్రశ్న కొందరు వేస్తూవుంటారు కదా! లోగడ ఎంతమంది — రాజకీయ నాయకులు శ్రీ మొరార్జీ భాయ్ దేశాయ్ నుంచి శ్రీ కామరాజ్ నాడార్, శ్రీ నీలం సంజీవరెడ్డి ప్రభృతులదాకా తమ "పరా జయ గాయాల"ని మానేదాకా "నాకేసు కుని" — మళ్ళీ గోదాలోకి దూకలేదూ?" అని శ్రీమతి గాంధీ అభిమాని అయిన మహిళ ఒకామె వాదించింది.

ఏది ఏమైనా శ్రీమతి గాంధీని "యమర్జన్సీ చీకటి కాలంలో 'అమ్మవు అమ్మలగన్న అమ్మవు' అని కీర్తించితే బోలెడు పణం, ఫలితం దక్కాయి— ప్రత్యేకించి గ్రంథ కర్తలకి; ఎమర్జన్సీ అయిపోయాకా యిప్పుడు ఆమెను 'తిడుతూ' రాస్తే ఆ పుస్తకాలకు లక్షల రూపాయలు ఆదాయ మొస్తోంది! ఏదో సామెత చెప్పి నట్లు "ఏనుగు బ్రతికినా చచ్చినా వెయ్యి రూపాయలే" అని ఆమె మీద వ్రాసే ప్రతి 'ఫిక్షన్'కి 20; 40 రూపాయల వెల గల బైండు గ్లేజు గౌరవం లభిస్తోంది!!!

[ వి రా జీ ]

సీరియల్

# శాంతి తీరం

చక్కిలం విజయలక్ష్మి

*(గత సంచిక తరువాయి)*

సాయంకాలం మళ్ళీ హాస్టల్ కెళ్ళి, జయను చూసి, ఆవిడగారిచ్చిన పంచల చాపూ, ఉత్తరీయాదులు తీసుకుని ఆనంద్ గది వైపు నడిచాను.

రిక్షా దిగి రిక్షావాడికి డబ్బులిచ్చి ఇంటి వైపు చూడగా— హతోస్మి— ఇంటికితాళం తల కొట్టుకుంటూ రిక్షా ఎక్కుదామని తిరిగి చూశాను. హతోస్మి, రిక్షా అదృశ్యం! 'దుంపతెగ, క్షణాల్లో మాయ మౌతారీ రిక్షావాళ్ళు' అని తిట్టుకుంటూ మరో రిక్షాకోసం చూస్తూ నిలబడ్డాను. దూరంగా సైకిల్‌మీద...ఔను ...నరేంద్ర! అతన్ని చూసిన వారం పది రోజులవరకూ ఆ తియ్యని నవ్వులూ, మురుకైన చూపులూ, ఇంతెత్తున మిడిసిపడే జుట్టూ గుర్తువచ్చేవి కానీ ఆ తర్వాత మరిచేపోయాను. బహుశా ఒక్కసారి మాత్రమే చూసినందువల్లా, ఆ తర్వాత చాలా రోజులు చూడనందువల్లా కావచ్చు

దగ్గరగా వస్తూ "హలో" అన్నాడు పలకరింపుగా నవ్వుతూ

తడబడ్తూ "హలో". అన్నాను.

సైకిల్‌దిగి "రండి" అంటూ తాళం తీశాడు.

మొహమాట పడ్తూనే లోనికి వెళ్ళాను. నా అవసరం మరి.

"కూర్చోండి"

కూర్చున్నాను ఫ్లాస్కులోంచి రెండు కప్పుల్లో కాఫీ తెచ్చి ఒకటి నాకిచ్చి రెండ వది తను తీసుకున్నాడు. మౌనంగానే కాఫీ త్రాగాము. కప్పు క్రింద పెట్టిన తర్వాత కూడా అతని ముందు .. ముఖ్యంగా ఎవరూ లేని ఒంటరితనంలో అతని ముందు నోరు విప్పలేకుండా వున్నాను! ఏమిటీ పిరికితనం ఇంతలో అతని గొంతు వినిపించింది.

"నేను విన్నదేమిటంటే మీరు చాలా గడుసువారనీ... మాటల్లో మిమ్మెవర్లూ గెలువలేరనీ..." అతినిదానంగా అన్నాడతను సన్నగా నవ్వుతూ.

చురుక్కున చూశాను, 'అయితే?' అన్నట్లు.

"అయితే, నా ఉద్దేశం మీకు మాట లంతగా... రావని" నవ్వకుండా అన్నాడు.

నేను నవ్వకుండా వుండలేక పోయాను సన్నగానైనా.

"అయితే ఒకటి మాత్రం నిజం" అన్నాడు సీరియస్‌గా.

'ఏమిటి?' అన్నట్లు చూశాను.

"చ్! నోటితో అందరూ మాట్లాడ గలరు. కళ్ళతో మాట్లాడగలగటం అందరికీ రాదు" నా కళ్ళలోకి చూస్తూ అన్నా డతను.

**జరిగినకథ 3 :** గమ్యం తెలియ కుండా ప్రయాణిస్తూ రైల్లో తార సిల్లిన మాధవిని తనతోపాటు తీసు కొస్తాడు శ్రీనాథ్. మాధవి, శ్రీనాథ్ భార్య వసంత స్నేహితులు. పెళ్ళి కాకుండానే గర్భవతయిన మాధవి వసంత ఇంట్లోనే వుండిపోతుంది. బిడ్డనుకన్న మాధవి కాలక్షేపంకోసం అంటూ పట్టుపట్టి వుద్యోగంలో చేరుతుంది. వేరే ఇల్లు తీసుకుని వెళ్ళి పోతుంది మాధవి. వసంత పట్టుదల మీద తన జీవితంలో చీకటిని వదలి పోయిన సంఘటనలను గురించి చెప్పటం ప్రారంభిస్తుంది మాధవి

నేను అతనేం చెబుతాడోనని శ్రద్ధగా వింటూ ఉండటం వల్ల అతని చూపులనంతగా పట్టించుకోలేదు. అతని మాటలు విన్న తర్వాత గాని ఆ చూపుల భావం తెలిసి రాలేదు ఎర్రగా చూశాను

చిలిపిగా నవ్వుతూ "నిజానికి ముక్కు, పెదిమలకంటే కళ్ళు కోపాన్ని మరింత అందంగా ప్రదర్శించగలవు" అన్నాడు

అతని మాటలకు నాకు కోపం రావటం లేదు నవ్వు వస్తోంది అమ్మో! ఎంత గడుసరి! ఎంత చమత్కారంగా ఎంత చిలిపిగా మాట్లాడగలడు! ఆ రోజు మా బట్టలన్నీ తడిసి, బాత్ రూం తలుపులు తీసుకుని ఎంతో అమాయకంగా వచ్చిన నరేంద్రకూ, ఈ నరేంద్రకూ— పైగాడ్ పోలికే లేదు!

నా ఆలోచనా పూరిత మౌనాన్ని ఏమను కున్నాడో మరి "కోపం వచ్చిందా?" మరీ జాలిగా అడిగాడు

"ఊఁ? అప్పే జౌను "

ఫక్కున నవ్వాడు

పట్టుబడిన దొంగలా ఎదురు చూపులు చూడసాగాను బహుశా సిగ్గులో నాముఖం ఎర్రబడకూడా వుండవచ్చు

అతనేమనుకున్నాడో మరి, బహుశా అంతగా పరిచయంలేని అమ్మాయిలో ఇలా చనువుగా, ఎగతాళిగా మాట్లాడటం సభ్యత కాదనుకున్నాడేమో, ముఖాన్ని గంభీరంగా మార్చుకుని "ఇంతకూ మీరేదో పని మీద వచ్చినట్టున్నారు?" అన్నాడు

అంపమీద పాలు పోసినట్టు ఫీలయ్యాను

"ఆనంద్‌గారు లేరా?"

"రేపు లతని బర్త్‌డే అట. బర్త్‌డేకు వాళ్ళ అమ్మగారు గుడ్డలే పం పంపేవారట. ఇంతవరకూ పంపలేదనీ, జయశ్రీ కూడా వూరినుండి వచ్చినట్టు లేదనీ ఈ ఉదయమే ఊరు వెళ్ళాడు,"

"అరె! జయ వచ్చి నాలుగురోజులైంది. గుడ్డలు కూడా పంపారు వాళ్ళమ్మగారు" అన్నాను నొచ్చుకుంటూ.

"అలాగా. అతనికి తెలీదు మరి అక్కడికీ ఈ వుదయం వెళ్ళి హాస్టల్లో చూసి రమ్మని కూడా చెప్పాను. 'వచ్చేలాగయితే లెటర్ వ్రాసి వచ్చేది. స్టేషన్‌కివెళ్ళి రిసీవ్ చేసుకోకపోతే చెవి మెలిపెట్టేది' అంటూ వెళ్ళిపోయాడు" అన్నాడు నవ్వుతూ.

నేనూ నవ్వాను అతని నవ్వును అలాగే చూస్తూ

"జయకు టెంపరేచర్ వుంది. అందు వాళ్ళ వూళ్ళోనే ఎక్కువ అయిందట. వారం రోజులు ఆగే వచ్చింది ఏరోజు వస్తానన్నది నిర్ధారణగా తెలియదు కాబట్టి లెటర్ వ్రాయలేదట "

"ఇప్పుడెలా వుంది?"

"అలాగే వుంది. అందుకే నన్ను ఇచ్చి రమ్మంది" అన్నాను చేతిలోని పాకెట్ చూ



చూస్తూ. ఒక నిముషం మౌనంలో గడిచింది.

''వెళ్తాను'' అన్నాను లేస్తూ.

''వస్తాను అనండి'' అన్నాడు నవ్వుతూ.

ఓరగా చూశాను. ''ఏమిటి మీ వుద్దేశం?'' అన్నట్లుగా.

''వెళ్తానని అనకూడదు. వెళ్లొస్తాను అనాలి. అంతే'' అన్నాడు, పొరపాటును సరిదిద్దుకుంటున్నానంతే అన్నట్లుగా.

లేచి రెండడుగులు వేశాను

''మాధవి—గారూ'' పిలిచాడు.

ఆగిపోయాను వెనక్కు తిరగలేదు. ఒక నిముషం గడిచినా అతనేమీ చెప్పలేదు. అత నేమో చెప్పాలనుకుంటూన్నట్లూ, చెప్పలేక ఆగిపోయినట్లూ గ్రహించాను ఇంకాఅక్కడ ఆగటమూ, 'ఏమిటి?' అని అడగటమూ నన్నునేను చులకన చేసుకున్నట్లు అవు తుందని మరి చెప్పకుండా గబగబా బయటకు అడుగులు వేశాను.

హాస్టల్‌కి వెళ్లి ఆనంద్ వూరు వెళ్లి నట్లు చెప్తే జయ కంగారు పడింది

''అన్నయ్య ఎంత ఆదుర్దా పడ్డాడో'' అంది.

*  *  *

# శాంతి తీరం

మర్నాడు ఉదయమే హాస్టల్‌కి వెళ్లేసరికి అప్పటికే ఆనంద్ వచ్చివున్నాడు. రాత్రి ట్రైన్‌కు వచ్చాడట నేను వెళ్లినప్పుడు ''నిన్ను నీ పెళ్లాంచేతే తన్నించకపోతే చూడు'' అని బెదిరిస్తోంది జయ చెల్లెలి తలనిమురుతూ ''అలాగే తన్నిద్దువుగానీలే'' అంటున్నాడు ఆనంద్. నాకు నవ్వుఆగలేదు

''ఏమిటి? అన్నా చెల్లెళ్లు గొడవ పడుతున్నారు'' అన్నాను నవ్వుతూ.

''ఇదిగో ఈసారికి అంటే అన్నావుగానీ మరోసారి అన్నా చెల్లెళ్లనకు. శత్రువులు అను. అండర్‌స్టాండ్?'' కస్సుమంది జయ

జయ చూడకుండా 'ఒప్పేసుకో'అన్నట్లు సైగ చేశాడు ఆనంద్.

''అలాగే'' అన్నాను నవ్వును బిగపడ్తూ.

జయకు దగ్గరగా వెళ్లి ''ఎలా వుంది ఈ రోజు?'' అడిగాను.

''బాగానే వుంది'' అని నాకు సమా ధానం చెప్పి ఆనంద్‌కేసి వోరగా చూస్తూ ''బాగాలేని దినాల్లో చెల్లి గుర్తు రాలేదు. అంతా నయమయ్యాక హాస్పిటల్లో అడ్మిట్ కావాలట. లేదా తన గదికి వెళ్ళాల అంది కోపంగా.

''నీవే చూడమ్మా మాధవీ. ఇంకా అలాగే వుంది దీన్నిక్కడ ఈస్థి వదిలి నేను అక్కడెలా వుండగలను? టల్‌లోనో, నా గదిలోనో అయితే దగ్గరుండి కనిపెట్టుతూంటానుగానీ హాస్టల్ గదుల్లోకిరావడం ఎంత అసహ వుంటుంది! అసలు ఘోషా ఎలా చేస్తారు?''

''ఆనంద్ చెప్పింది నిజమే జం అన్నాను'

నన్ను మింగేసేలా చూసింది ''ఆ లోకంలోనో లేక ఆ బ్రహ్మచారుల లోనో పడి చావమంటావ్! నీకేం నా కాదు బాబూ'' అంది

''అయితే వూరికి వెళ్దాం పద''అ ఆనంద్.

''వో, బోర్, ఐ కాంట్...ఐ కా నుదురు చిట్లించింది.

''సరే. నీ ఇష్టం. నాకు ఆ ల్సైమవుతోంది. వెళ్తున్నాను'' అని బయటకు వెళ్తూ నన్ను రమ్మన్న సౌంజ్ఞ చేశాడు.

''నేనూ వెళ్తాను. కాలేజీ టైమయింది'' అంటూ నేనూ బయటకు వచ్చాను.

గేట్ దగ్గర కాచుకుని వున్నాడు ఆనంద్

''మాధవీ, ఎలాగో నీవైనా దాని తల కెక్కించు. ఒట్టి మొండిది. నేను చెబితే మరీ బిగిసి పోతుంది'' అన్నాడు విసుగ్గా.

''మీరేమీ వర్రీ అవకండి ఎలాగైనా నచ్చచెప్పి సాయంకాలం తీసుకు వస్తాను ఆ తర్వాత హాస్పిటల్ సంగతి ఆలోచిద్దాం'' అన్నాను

''థెంక్యూ'' అన్నాడు రిలీఫ్‌గా.

''ఇప్పుడు కాదు సాయంకాలం'' అన్నాను నవ్వుతూ

'కరెక్ట్ కరెక్ట్ ఆ మొండి ఘటం దిగివస్తే కదా'' అని ''వస్తానమ్మా'' అంటూ వెళ్లిపోయాడు నేనూ కాలేజీకి వెళ్ళాను

ఆ సాయంకాలం కాదుగానీ మర్నాటి సాయంకాలం జయను తీసుకుని ఆనంద్ గదికి వెళ్ళాను.

అప్పటికే ఆనంద్ పనిమనిషితో వున్న రెండు గదులూ శుభ్రంగా దులిపించి, కడిగించాడు కిటికీ పక్కగా మంచం, చక్కగా అమర్చిన పరుపు, దోమతెర. మంచానికి పక్కనే స్టూల్ దానిమీద అప్పటికే పళ్ల రసం గ్లాసు, ఫ్లాస్క్, థర్మామీటర్‌ఉన్నాయి మంచం వెనగ్గా టేబుల్ ఫ్యాన్

గదిలోకి రాగానే ఈ అరేంజ్‌మెంట్స్‌తో పాటు నా కళ్లు మరో విషయాన్ని కూడా పసికట్టాయి అతను . ఆ పోకిరీ నరేంద్ర లేడు! ఎందుకోగానీ కాస్త నిరాశగా అనిపించింది

మాటల సందర్భంలో తెలిసింది నరేంద్ర వాళ్ల తాతగారువెంటనే రమ్మని టెలిగ్రాం ఇస్తే రాత్రి వెళ్లిపోయాడట అప్పుడే తెలిసింది, నరేంద్రకు తాతగారు అప్ప తల్లీ, తండ్రీ, తోబుట్టువులూ లేరనీ చండశాసను డైన తాతగారంటే నరేంద్రకు కాస్త బెదురనీ

ఈ విషయాలు విని నా కెందుకో నరేంద్ర అంటే కాస్త జాలి అనిపించింది

## 8

నాలుగంటే నాలుగే రోజులుండి జయ తిరిగీ హాస్టల్‌కి వచ్చేసింది. ఆ నాలుగు రోజులూ జయను చూసేందుకు వెళ్లినా నరేంద్ర మాత్రం కనిపించలేదు.

జయ జబ్బుపడి లేచాక ఆనంద్ తప్పని సరిగా హాస్టల్‌కు వచ్చేవాడు అందువల్ల ఆనంద్ గదికి వెళ్లే అవకాశం ఇక లేక పోయింది

నిర్మలమైన నా మనసులో ఏమిటీ ఆగని అలలు!

మూడేళ్ల నా కాలేజీ జీవితంలో ఎన్నో ప్రేమలేఖలు అందుకున్నాను ఎందరో నేరుగానే తమ ప్రేమ వెల్లడించారు. అయినా కదలిక ఏర్పడలేదు నిర్లక్ష్యంగా నవ్వుకునే దాన్ని

ఎవరీ నరేంద్ర? నిజం చెప్పాలంటే పెద్ద అందగాడూ కాదు, పెద్ద పరిచయమూ లేదు! చూపులతో రెండు చిలిపి మాటలతో ఇంతగా వగ్గాలువేసి తనవైపు లాక్కోవటం ఎంత విచిత్రం!

దాదాపు రెండు నెలలు గడిచిపోయాయి. ఒక సోమవారం ఉదయం కాలేజిలో చెప్పింది జయ ''నిన్న మా రావణాసురుడితోపాటు నరేంద్ర కూడా వచ్చాడు'' అని.

నా గుండె ఒక్క క్షణం ఆగినట్లైంది ఆ పేరు వినగానే.

''ఎందుకలా వులికి పడ్డావ్?'' అంది.

''అబ్బే'' అన్నాను.

''ఇంతకూ అతను నన్ను చూసేందుకే నంటావా వచ్చింది?'' అంది ఆలోచిస్తూ.

ఎన్ను చూసేందుకైనా కావచ్చు. లేదా హాస్టల్లోవున్న బోలెడు మంది అమ్మాయిలను చూసేందుకైనా కావచ్చు''అన్నాను భుజాలు ఎగరవేస్తూ.

''చాల్లే. నరేంద్ర అలాంటివాడు కాదు'' అంది మందలింపుగా.

''ఎలా తెలుసేమిటి?'' అన్నాను. జయ అలా అనటం నా కెంతో బాగుంది. 'నరేంద్ర అలాంటివాడు కాదు' అంటే? సో గుడ్! ఓహ్!

''ఆ గుర్తొచ్చింది. అతను 'మీ ఫ్రెండ్ రాలేదా?' అన్నాడు. అప్పట్లో నే నంతగా అతని మాట పట్టించుకోలేదు. ఎందుకంటే అప్పుడు అన్నయ్యతో కొట్లాడు తున్నాను. వాడేమన్నాడో తెలుసా? ఆ నరేంద్ర ముందు 'నీ కోతి ముఖానికి మొగుడే రాడుపో' అన్నాడు. నా కోపం మొచ్చి 'అయితే నాకు మొగుడు వచ్చాకే నీకు పెళ్లాం రావాలిపో' అని శపించాను. ప్చ్. ఏంచేస్తాడు పాపం! తనపెళ్లాం కోసమైనా నాకు మొగుడ్ని పట్టుకొస్తాడు. ఏమంటావ్? అరె! ఏదో మాట్లాడేస్తున్నాను కదూ? ఆ ఇంతకూ నరేంద్ర ఎవర్ని గురించి అలా అడిగాడంటావ్?'' అనుమానంగా చూస్తూ అంది

అప్పటికే నా మనసు వూహల్లో తేలి

## మరమరాల — పులిహోర

— తిరువూరు వీరాదేవి

కావలసిన వస్తువులు మరమరాలు 2 శేర్లు, మంచినూనె 100 గ్రాములు, పచ్చిమిరపకాయలు 10, వేయించిన శనగపప్పు 100 గ్రా, నిమ్మకాయలు2, ఆవాలు 1 స్పూను, పచ్చి శనగపప్పు 1 స్పూను, ఎండుమిర్చి 2, కరివేపాకు, మరియు తగినంత ఉప్పు, (మెత్తనిది) పసుపు.

తయారుచేయు విధానం మరమరాలు శుభ్రపరచి, నీళ్ళతో కడిగి వడవేయాలి. నీళ్లల్లో ఎక్కువసేపు నాననీయకూడదు. తరువాత పచ్చిమిరపకాయలు మెత్తగా ముద్దగా నూరి ఉంచుకోవాలి. అలాగే వేయించిన సెనగపప్పు కూడ పొడికొట్టుకొని ఉంచుకోవాలి. ఇవి సిద్ధము చేసుకున్నాక పొయ్యిమీద బాణలి పెట్టి మంచి నూనె పొయ్యాలి. నూనె బాగా కాగిన తరువాత ముక్కలుగా చేసి ఎండుమిర్చి, ఆవాలు, శనగపప్పు, కరివేపాకు, పసుపు మొ. పోపు సామాను వేసి వేయించాలి. ఎర్రగా వేగిన తరువాత నూరి ఉంచుకున్న పచ్చిమిరపకాయల ముద్ద కూడ వేసి బాగా వేయించాలి పెద్ద మంట ఉండకూడదు. అవి అన్నీ బాగుగా వేగిన తరువాత వడకట్టి ఉంచుకున్న మరమరాలు, ఉప్పువేసి బాగా క్రిందికి పైకి కలపాలి. తరువాత ఈ మిశ్రమంమీద కొట్టి ఉంచుకున్న పప్పుల పొడి చల్లాలి. అటు తరువాత ఒక 5 నిముషాలసేపు సన్నని సెగమీద ఉంచి దించుకోవాలి. తినేటప్పుడు నిమ్మకాయ రసం పిండుకొని తింటే చాల బాగుంటుంది. మధ్యాహ్నంపూట టిఫెను గా చేసుకు తినటానికి చాల బాగుంటుంది. వేడిమీదే తినాలి. శ్రమతక్కువ. కాని ఇది ఒకపూట కంటే ఎక్కువ నిలువ ఉండదు.








పోతోంది. నరేంద్ర... నరేంద్ర అలా అడిగాడా!

జయ అలా అడిగేసరికి కోపమొచ్చి "నీకెంతమంది ఫ్రెండ్స్ వున్నారేమిటి? అదీ నరేంద్రకు తెలిసి?" అన్నాను.

"ఏమిటీ!!!" అంది ఆశ్చర్యంగా కళ్ళు వెడల్పుచేసి నాలుక్కరుచుకున్నాను నా పొరపాటుకు.

"హాయ్" అంటూ హుషారుగా నవ్వి "ఇదిగో మాధవమ్మా ఏమిటి కథ?" అంది భుజంమీదుగా వంగి రహస్యంగా.

నా అవస్థ గ్రహించినట్లుగా బెల్ కొట్టారు.

"కామెర్ల కళ్ళనీ, అన్నీ పాడు బుద్ధులు. కథలేదు. కమామిషు లేదుగానీ పదపద, 'కీట్స్' మిస్ అవుతాము" అంటూ తోసుకెళ్ళాను.

"విప్పా, నిజమూ దాగవోయ్. యు మస్ట్ ఫెల్ యువర్ టేల్" అంటూ క్లాస్‌రూంలోకి వెళ్ళేదాకా బెదిరిస్తూనే వుంది జయ.

ఇది జరిగిన వారం రోజుల తర్వాత ఆ సాయంకాలం క్రొత్తగా కట్టిన వెంకటేశ్వ రాలయం చూసి వద్దామని బయల్దేర దీసింది జయ. ఆలయమంతా చూసి ఆలయం వెనక మొక్కల మధ్య కూర్చున్నాము. కూర్చోగానే కంగారుగా లేచింది జయ "గుళ్ళో బాగ్ మరచి పోయాము" అంటూ.

తను వెళ్ళిన వైపే చూస్తూ కూర్చున్నాను. 'బొత్తిగా మతి మరుపు' అని విసుక్కుంటూ.

"హలో"

ఉలికిపడ్డాను.

నరేంద్ర!

ఇదెలా సంభవం?!

"మీరు...!"

"టెంపుల్ చూద్దామని వచ్చాను. వస్తే..." ఆగిపోయాడు. అతని కళ్ళలో దాగని ఆనందం ఇంతకుముందు గుళ్ళోని హారతిలా వెలిగిపోతోంది.

"వస్తే?" అన్నాను కుతూహలంగా.

"దేవాలయానికి వస్తే ఏం కనిపిస్తుంది? దేవత" చిరునవ్వుతో అన్నాడు

సాహసం !

"ఈ దేవాలయంలో వుండేది దేవుడు" సరిదిద్దాను, అతని వుద్దేశం అర్థమైనా.

"పొరపాటు. దేవుడెప్పుడూ ఒంటరిగా వుండడు. అందులోనూ వెంకటేశ్వరుడు" లెంపలేసుకుంటూ అన్నాడు 'తప్పు తప్పు' అన్నట్లుగా.

"వెంకటేశ్వరుడు కూడా కొంతకాలం ఒంటరితనం అనుభవించాడు" అన్నాను వెంకటేశ్వర మహాత్యం సినిమా గుర్తు జేసుకుంటూ.

"అఫ్‌కోర్స్. అయితే ఆ కాలం దాటి పోయింది" అన్నాడు చిలిపిగా.

"అయితే ప్రస్తుతం దేవుడు దేవీ సమేతుడే నంటారా ?"

"ఎగ్జాక్ట్లీ మీరు ... అనుకుంటే" నా కళ్లలోకి సూటిగా చూస్తూ అన్నాడు.

"నరేంద్రగారూ !" అన్నాను తడ బాటుగా—నా కళ్లు వాలిపోయినై.

"మాధవీ"

"మాధవీ, మీ కెలా చెప్పాలో నా కర్థం కావడంలేదు." నరేంద్రగొంతులోని క్రొత్త దనానికి తలఎత్తి చూశాను. అతను దూరంగా చూస్తున్నాడు,

"మీరంటే నాకు... నాకు... ఊహూ, దాన్ని మాటల్లో పొదగ లేకుండా వున్నాను. బహుశా పొదగ గల్గినా మీకు అతిశయో క్తిగా తోచవచ్చు. పోనీ ఒక్క మాటలో చెబుతాను" అని చటుక్కున నా వైపు తిరిగి నా కళ్లల్లోకి ఆరాధనగా చూస్తూ "మాధవీ, మీరుంటే ఈ ప్రపంచంలోని మరోటి ఏదీ నాకు లేకపోయినా ఫరవాలేదు. చివరకు నా ప్రాణాలైనా" అన్నాడు ఆవేశంగా.

"నరేంద్రగారూ!"

"ఔను మాధవీ. నిన్ను చూశాక ఆక ర్షణో, ప్రేమో అదేదో చెప్పలేని భావం నన్ను వుక్కిరి బిక్కిరి చేసింది. నా ఇన్నేళ్ల జీవితంలో నాహృదయాన్ని ఇంతగా రంజింప జేసిన మనిషిగానీ, విషయంగానీ మరేదీలేదు ఆనందమో— ఊహూ— అది అనుభవించిన వారికే అర్థం అవుతుందేమో. చెప్పమాధవీ నీకూ అర్థమైందా?" అతను ఏకవచనం లోకి వచ్చినట్లు అతనికే తెలీనంత ఆవేశంలో వున్నాడు.

వణికే నా పెదిమలను మునిపళ్లతో అదిమిపట్టాను.

"నాకు తెలుసు. నాకు తెలుసు. చెప్పు మాధవి. నేనంటే... నీకు...ఇష్టమేనా?" చివరిమాట అతనిగొంతులోంచి వణుకుతూ వచ్చింది.

తల వంచుకుని వ్రేలితో ఇసుకలో వ్రాశాను. నరేంద్ర ఆత్రంగా చూశాడు.

"ఔను. ఇప్పుడు దేవుడు దేవీసమేతుడే"

నరేంద్ర పెదిమలు అంతులేని సంతో షంతో విచ్చుకున్నాయి. ఆనవ్వు గిలిగింతలు పెడుతుండగా దానికి తోడు "మాధవి" అంటూ నరేంద్ర చేయి నా చేతిని నొక్కు తూండగా తన్మయంగా కళ్లు మూసు కున్నాను.

ఆ తర్వా తెప్పుడో ఇల్లు చేరుకున్నాను. మర్నాడు ''బ్యాగ్ అండ్ బ్యాగేజ్'' తో జయ వచ్చింది.

''నిన్న నన్ను అలా వదిలేసి ఎక్కడికి వెళ్లావ్?'' అన్నాను కోపం నటిస్తూ.

''స్వర్గంలో వదిలి వెళ్లినా ఇంత కోపమా!'' అంది నవ్వుతూ.

గతుక్కుమన్నాను. దీనికి తెలిసినట్లే వుంది చూడగా.

''మధూ, నరేంద్ర ఏమన్నాడే? డ్యూయెట్ పాడుకున్నారా లేదా? అయినా దరిద్రపు ఇండియాలో అంత అదృష్టం కూడానా! ఆ ముచ్చట సినిమాల్లో వరకే గదా'' వాపోయింది జయ.

''అయితే నీవే కావాలని...''

''స్టాప్, స్టాప్. అంత బ్లేం వేయకు నా మీద. అలనాడు కృష్ణమూర్తే నింద మోయలేక చచ్చాడు నే ననగా ఎంత! ఆఁ ఏమన్నావ్? నేనే కావాలని మీకు ఏకాంతం కల్పించానంటావ్? అదేంలేదు. నేను బ్యాగ్ తీసుకుని వచ్చేసరికే మీరు ... అంతే. అబౌటర్న్, లెఫ్ట్ రైట్, లెఫ్ట్, రైట్ అంటూ మార్చి సు ంటూ ఇంటి ముఖం పట్టాను. నిజం చెప్పమంటావా? ఆ అదృష్టం, అదే, ఆ మీ సుందర సమాగమం నా చేతుల మీదుగా జరుగక పోయెనే అని తెగ బాధ పడ్తున్నాను.

# శాంతి తీరం

అయినా ఫరవాలేదులే. నేనేగా నిన్ను గుడికి లాక్కువెళ్లింది. ఆ పుణ్యమంతా నాదే. ఏమంటావ్? ఇంతకూ నరేంద్ర...''

''హుష్, గట్టిగా అరవకు'' దాని నోరు నొక్కేసినా పూర్తి చేయనే చేసింది. ''...ఒక్క కిస్...'' అంటూ.

నేను తలమీద చేయి పెట్టుక్కూర్చు న్నాను.

''సర్లే. మీ గొడవ నా కెందుకు. ఆఁ, నేను బాగ్ కోసం వెళ్లానా? వండర్! అక్కడేవుంది! అది పోయివుంటే—అమ్మో మా యమాసురుడు...''

''అబ్బబ్బబ్బ ఆపవే'' విసుక్కున్నాను

''అయినా ఇప్పుడు రాణీగారికి మా మాటలేం రుచిస్తాయిలే. రుచులు బాగా మారిన్నై. 'కొత్త కొత్త రుచులూ, తాజా తాజా రుచులూ' పాట అందుకుంది.

లేచివెళ్లి తలుపులు, కిటికీలు మూశాను.

''అదేం!?'' అంది ఆశ్చర్యంగా.

''గార్దభ రాజంబులు మా వీధిలో ఎక్కువలే'' అన్నాను వెటకారంగా.

''కానీ పాపం. నాకేం అభ్యంతరం లేదు. కొంపదీసి నీకు గాని...''

''అబ్బే, నాక్కూడా అభ్యంతరం లేదు. కానీ చుట్టు పక్కలవాళ్లు ఈ గాడిదల సంగీత కచ్చేరీ చూసి నన్నూ వాటిల్లోకి జమచేస్తే కష్టం'' అన్నాను కసిగా

''కష్టమేముందే వెర్రిదానా? వసు దేవుడంతటి వాడిచేత కాళ్లు పట్టించు కున్న పూజ్యజాతి కదా?'' చేతులు జోడ్చి కళ్లు అరమోడ్చి అన్నది భక్తి నటిస్తూ

''మావంటి అల్పులకు అంత పూజ్యత ఎందుకులే'' అన్నాను.

''నీ ఖర్మ అనుభవించు. ఆఁ ఇంతకూ గాడిదలు కిటికీల్లోంచి కూడా వస్తా యంటావా?'' అడిగింది అమాయకంగా ముఖం పెట్టి

''తమరి గాత్ర మాధుర్యానికి ముగ్ధులై ఎటునుండి వచ్చేది తెలియక కిటికీల్లోంచి చొరబడ్తే అర్భకపు కిటికీలు విరిగిపోయి.''

నా మాట పూర్తి కానేలేదు.

''నీ నడుములూ విరిగిపోయి, కథ్నూ కరిగిపోయి...'' చెయ్యెత్తుకుని నా వెంట పడింది జయ.

కెవ్వున కేకపెట్టి తప్పించుకుంటూ పరుగులు పెట్టాను

''అప్పట్నించీ చూస్తున్నాను నన్ను గాడిదల్లోకి జమ కడ్తావా రాస్కెల్ నేను పాడితే గాడిదలొస్తాయా ఇడియట్''

''ఏమిటే మధూ, కేకలు పెడ్తున్నారు'' అంటూ కేకేసింది అమ్మ వంట గదిలోంచి. చప్పున ఒక్కచోట కూలబడిపోయాం

''ఇదిగో, దొరికావ్, చంపేస్తాను'' అంటూ పీకపట్టుకుంది

''బాబ్బాబూ, వదలవే నీకు పుణ్య ముంటుంది. నరేంద్ర ఏమన్నదీ, ఏం చేసిందీ చెబుతానుగా'' అన్నాను దండం పెడుతూ.

కెవ్వుమంది. హడలిపోయాను.

''ఏం...చేసిందీ ..చ్చెబుతావా?'' అంది కన్ను గీటుతూ

''విత్ ప్లెజర్'' అన్నాను

నోటితో ఈలవేసి ''ప్రొసీడ్'' అంది వుత్సాహంగా.

''ఏం చేశాడంటే, ఏం చేశాడంటే, ఇది'' అంటూ కండవూడి వచ్చేలా తొడ మీద గిల్లాను,

మళ్లీ కెవ్వుమని అల్లాడి పోయింది కళ్లల్లోకి నీళ్లు కూడా వచ్చాయి పాపం ''యూ డెవిల్!'' అంది ఏడుస్తూ.

(ఇంకా వుంది)



# ప్రశ్నావళి

కె. రామలక్ష్మి

**జి. పి. ఆర్. టాటానగర్**

ప్రమాదానికి గుర్తు ఎరుపు మరి ఎరుపుగా వుండే సింధూరం తిలకంగా స్త్రీలు వాడుతారు మాకు పెళ్ళయింది మమ్మల్ని తాకకండి తాకితే ప్రమాదం అని ప్రియులకు హెచ్చరికగానా యీ గుర్తు ?

ఎలా పని చేస్తాయండీ మీ బుర్రలు ! అక్కడికి పెళ్ళి కాని కన్నెలు ఎర్రని బొట్టు పెట్టనట్టు ! . బొట్టు పెట్టుకున్నంతమాత్రాన రోడ్డుమీద పురుషులంతా సభ్యతగా ప్రవర్తించేస్తారా ? ! అలాగే అయితే, ఈ స్త్రీలకి ప్రత్యేక క్యూ లెందుకు,సీట్లెందుకు ? బొట్టు అందానికి ముఖం కళగా వుంటుందని కుంకుమ పువ్వుకి గిరాకి పెంచడానికై దక్షిణాదిన శంకరాచార్యులవారీ అలవాటు తెచ్చారని వో శాస్త్రవేత్త అంటే కాదు యిది ఆటవిక సమాజంలో స్త్రీ దూరంగా వున్నదని చెప్పే సూచన మాత్రమే నంటారొకాయన. కన్నతల్లి బొట్టుని దిష్టి చుక్కగా చూస్తుంది అరుణారుణ రక్త తిలకమై ప్రియుని కవ్విస్తుందా తిలకం. సిందూరం రక్త చందనం ఎగరేసి ఎర్రబాపుటా కలకత్తా కాళిక నాలిక అన్నీ ఎరుపే, అన్నీ అందానికి ఆవేశానికి చిహ్నాలుగానే కనిపిస్తాయి అందుకే ఎందుకైనా మంచిది, మీ నిర్వచనం మీరే పాటించి కాస్త బొట్టున్న ఆడదానికి దూరంగా నడవండి

**కె. టి. ఎస్. అప్పన్నపేట**

అదేమిటిరా ? ఆడదానిలా అలా ఏడుస్తావు అంటారు. ఆడవాళ్ళు అస్తమానూ ఏడుస్తూ కూర్చుంటారా ?

అప్పన్నపేటలో పట్టుకుని పాలిక గడప వుంటుందో లేదో వోసారి తిరిగి చూసేస్తే మీకే తెలిసిపోనీ సంగతి !. ఆడది తనకై తను ఏడవదు. ఆడదాని కన్నీటితో ఆనందం కొనుక్కునేవాళ్ళు వీడిపిస్తుంటారంతే, చిన్నతనం నుంచీ, దెబ్బతిన్నా బాధ కల్గినా ఏడవకూడదు మగవాడివికదూ ! అని కట్టడిచేసి తల్లే మగవాళ్ళు ఏడవకుండా చేసిందని మరిచిపోకూడదు ఏడుపు కూడా అలవాటే. ఆడది పబ్లిక్‌గా ఏడుస్తుంది మగవాడు రహస్యంగా ఏడుస్తాడు అంతే తేడా

**పి. వి. ఎస్. పెదకొంకి**

ఒకచెట్టుకు పుట్టిన కాయలన్నీ ఒకే ఫలితాన్నిస్తాయి కాని ఒకేతల్లి కడుపున పుట్టిన పిల్లలంతా ఒకేలాగ ప్రవర్తించరెందుకు ?

ఒక చెట్టుకాయంతా ఒకేలా వుంటుందని ఎలా చెప్పకలరు ?! . వ్యత్యాసం ప్రకృతి సిద్ధం అది మనిషైనా మ్రానైనా ఒకటే వైవిధ్యం లేని ప్రకృతిని ప్రపంచాన్ని వోసారి వూహించి చూడండి ఎంతభయంకరంగా వుంటుందో ?. ఫాక్టరీల్లోంచి వచ్చే సరుకులాగా ! మూసతో పోసినట్టు జనం కూడా వుంటే భరించలేం

**సి. పి. ఎస్. నందికుంట**

అల్లునికిచ్చిన కట్నం అన్నదమ్ములు భాగరీత్యా పంచుకోవచ్చునా ? మామగారిచ్చిన కట్నం అన్నదమ్ములకు భాగం అవుతుందా ?

బాగుంది వరస కట్నం తీసుకోడమే దోషం అంటూంటే దాన్ని భాగాలెలా పంచుకోవాలని అడుగుతున్నారు ...సభలో మనమాట ఎన్నిలక్షలేమిటి అన్నదమ్ములు వాటా కొస్తున్నారు. ?!




**వి. వి. ఎస్. ఆర్. తాళ్లపూడి**

చుట్టుపక్కల వాతావరణాన్ని పట్టి మనిషి మారుతాడా ?

తప్పకుండా మారుతాడు ముఖ్యంగా చిన్న పిల్లల పెరుగుదలపై చుట్టుపక్కల వాతావరణం తప్పకుండా తన ప్రభావాన్ని చూపెడుతుంది. దిక్కూ మొక్కూ లేకుండ రోడ్లమీద పెరిగిన పిల్లలు రోడ్లమీద కుక్కపిల్లల్లాగే కొట్లాడి కొట్లాడి బ్రతుక్కువస్తారు. అదే రక్షణతో బ్రతికిన పిల్లలు సౌమ్యులుగా, కాస్త సిరికివారిగా కూడా పెరుగుతారు.

**ఎ. బి. ఆర్. ఎస్. ఎస్. ఎస్. రాయగడ**

పుట్టిన ప్రతిబిడ్డ ముందు అమ్మా అని పిలుస్తారెందుకు ? నాన్నా అని పిలవరేం ?

సృష్టికి మూలాధారం తల్లి న్యాయమే కదా ఆమెని గుర్తించడం ?!

**పి. ఎస్. కదిరి**

ప్రేమకు అంతం ?
ద్వేషం
చావుకు మొదలు ఎక్కడ ?
పుట్టుకలోనే !.
త్యాగానికి ఫలితం ?
సంతృప్తి
న్యాయానికి విలువ ఎంత ?
కట్టలేనంత !

**వి. ఎస్. ఆర్. చిత్తూరు**

తోటకూర ఆశాలత చిరునామా లలులలులు ?

తెలిస్తే చెప్పేదాన్నే ఆయనగారి ఎడ్రసు ! బహుశా మహిళా దర్శకురాలు శ్రీమతి విజయ నిర్మలగారి నడగండి

**పి. ఎస్. కోవూరు**

రామలక్ష్మిగారూ, మీరిక మీ ధోరణిమార్చుకోవలెను. మీ ఆడవాళ్ళ రాజ్యాలేలే రోజులు పోయాయి. అందుకు నిదర్శనం మొన్నటి ఎన్నికలు.

యివే తొలి ఎన్నికలా ? ఆఖరు ఎన్నికలా ? చూడండి. యిన్నియుగాల చరిత్ర చాటిచెప్పే సత్యాన్ని మభ్యపెట్టి ఏదో కబుర్లు చెప్పాలని చూస్తారేం ? ఏవరూ శాశ్వతంకాదని చరిత్ర పాఠం

**వి. ఎస్. డి. అనంతపురం**

నేను ఒకరిని ప్రేమించాను కాని మా పెద్దలు వేరొకరితో పెళ్ళి నిశ్చయించారు నాకు ఏం చెయ్యాలో తోచడంలేదు.

ప్రేమించడానికి ముందర మీ పెద్దల తత్వం తెలియదా ? చదువుకుని, ఆర్థికంగా మీ కాళ్ళపై మీరు నిలవకలిగిన స్థితిలోవుంటే యీ పిరికితనానికి చోటు వుండదు, అవతలి వ్యక్తికి కూడా కాస్త చేవ, పెళ్ళాన్ని పోషించ కలస్తోమతువుంటే మీ పెద్దలుమటుకుఎందుకు ఛెనుతిస్తారు ? !

ఇప్పుడు మీరు అతని పళ్లను
పిప్పిపళ్లు కాకుండా చెయ్యవచ్చును.

# వాడండి సిగ్నల్ 2

పళ్లను గట్టిపరచి దంత క్షయాన్ని నివారించేందుకు
దీనిలో అత్యంత ప్రభావంగల ఫ్లోరైడ్ ఫార్ములా ఉంది.




పంటినొప్పివల్ల కలిగేది కేవలం బాధ మాత్రమే కాదు.
దంతక్షయానికి అది సంకేతం కూడా. అశ్రద్ధ చేస్తే
దంతక్షయం మరింతగా జరిగి పిప్పి పళ్ళు అయిపోతాయి




నోటిలో ఊరే ఆమ్లాలు పళ్లలోకి చొచ్చుకుపోయి దంతక్షయాన్ని కలిగించకుండా మామూలు టూత్‌పేస్టులు ఆపలేవు.




సిగ్నల్ 2లో అత్యంత ప్రభావంగల ఫ్లోరైడ్ ఫార్ములా ఉంది. ఇది నోటిలోని ఆమ్లాలు పళ్లలోకి చొచ్చుకుపోయి దంతక్షయం కలిగించకుండా అరికడుతుంది.

## పిప్పి పళ్లను నిరోధించే టూత్‌పేస్ట్

పరిస్థితి విషమించక ముందే మీ కుటుంబంలో వారంతా వాడండి సిగ్నల్ 2—దంతక్షయాన్ని నిరోధించడంలో నిరూపించబడిన టూత్‌పేస్ట్. దీనిలోని ప్రత్యేకమైన ఫ్లోరైడ్ ఫార్ములా పళ్లతో కలిసి వాటిని గట్టిపరుస్తుంది, పళ్లకు హాని కలిగించే నోటి ఆమ్లాలను నిరోధించేందుకు మరింత శక్తినిస్తుంది—పిప్పి పళ్ళు కాకుండా కాపాడుతుంది. దంతక్షయాన్ని అరికట్టడంలో దీనికి మించిన టూత్‌పేస్ట్ లేదు. మేం చెప్పిందే మీరు నమ్మక్కర్లేదు, మీ దంత వైద్యుని కూడా అడగండి.



**సిగ్నల్ 2 ఫ్లోరైడ్‌తో** కుటుంబంలో వారికి పిప్పి పళ్లు రాకుండా నిరోధిస్తుంది.

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

లింటాస్-SG2-1-223 TE




## పాప పుణ్యాలు

"పరోపకారః పుణ్యాయ
పాపాయ పర పీడనమ్"

అనే మాట అందరికీ పరిచితమైనదే! ఇతరులకి ఏ మాత్రమైనా ఉపకారం చేస్తే పుణ్యం లభిస్తుందనీ, ఇతరులకు స్వల్పమైన బాధ కలిగించినా పాపం వస్తుందనీ దీని అభిప్రాయం. ఇక్కడ పరుడంటే ఇతరుడని మాత్రమే అర్థంకాదు. శత్రువని కూడా అర్థం గ్రహించవచ్చు. మంచి పుణ్యం సంపాదించాలంటే శత్రువుకు కూడా ఉపకారం చెయ్యవలసి వుంటుందని గ్రహించవచ్చు. అలాగే తనకు అపకారం చేసిన శత్రువును కూడా ఏమాత్రం బాధించకూడదనీ, బాధించి నట్లయితే పాపం వస్తుందనీ తెలుసుకోవాలి. ఈ సూక్తి వల్ల ఉత్తముడు ఏ విధంగా ఉండాలో స్పష్టంగా తెలుస్తున్నది.

అయితే. యిందులో 'ఇలాచేస్తే పుణ్యం వస్తుంది, ఇలా చేస్తే పాపం వస్తుంది' అని ఉన్నదే కాని పాపం అంటే ఏమిటో, పుణ్యం అంటే ఏమిటో చెప్పబడలేదు.

ఇతరులను హింసించడం పాప లక్షణం. అంతేకాదు. న్యాయమార్గాన్ని విడిచి, యితరులను మోసగించి ధనం సంపాదించడం, అవసర వస్తువులు ఇతరులకు లభించకుండా తానే కొనివేసి దాచి పెట్టుకోవడం కూడా పాపలక్షణ మవుతుంది.

ఇతరులు ఎంతో శ్రమపడి సంపాదించిన ధనాన్ని — వారిని మోసగించి, అన్యాయంగా తీసుకోవడం పాపంకాక ఏమవుతుంది?

మనకు డబ్బు ఎందుకు? జీవనానికి కావలసిన ఆహారపదార్థాలను, ఇతర వస్తువులను సంపాదించుకొనుటకే కదా! పయివాళ్ల డబ్బును అపహరిస్తే, వారు వస్తువులను కొనుక్కోవడానికి అవకాశం పోతుంది. ఆ విధంగానే తానే ఎక్కువ డబ్బును కూడబెట్టి దాచుకుంటే — వస్తువులు కొనడానికి డబ్బులేక యితరులు ఎంతో బాధపడతారు. ఈ రీతిగానే తనవద్ద ధనం వున్నదిగదా అని వస్తువులను కొనివేసి, యితరులకు అవి అందకుండా చేస్తే, కొంచెం పైకమున్నా, వస్తువులు దొరకక ప్రజలు బాధపడతారు. తాను దాచుకొన్న వస్తువులను ఎక్కువ లాభాలకు అమ్ముకోవాలనే కదా ఉద్దేశం? అది పాపంకాక ఏమవుతుంది?

ఇక పుణ్యం సంగతి. తనకు శక్తి ఉన్నంతవరకూ ఇతరులకు ఉపకారం చెయ్యడమే పుణ్య లక్షణం. ఎవ్వరికీ ఎట్టి ఉపకారం చెయ్యక స్వార్థపరులయి దేవాలయాలకు పోయినందువల్ల, తీర్థాలలో స్నానం చేసినందున పుణ్యం సంపాదించగల మనేది భ్రాంతి. తాము కష్టపడుతూ ఉన్నా ఇతరులకు సహాయపడే మహనీయులు ఎందరో ఉన్నారు. వారిని ఆదర్శంగా గ్రహించి, వారి అడుగుజాడల్లో నడవడానికి ప్రయత్నం చెయ్యాలి.

ఒకప్పుడు పరులను హింసించడం పాపం కాకపోవచ్చు. మన సొమ్మును, వస్తువులను ఇతరులు అపహరించుకొనిపోతూ ఉన్నప్పుడూ, మనలను హింసించినప్పుడు, అలాంటివారిని బాధించవలసినదే!

ఆత్మ రక్షణకోసం శాంత గుణాన్ని విడిచిపెట్టడం, హింసించేవారినుండి తప్పించుకోడానికి వారిని హింసించడం పాప కార్యం కాదనే అంటారు.

# ఒక మనసున్న కథ

మద్దా వెంకటరమణరావు

*(గత సంచిక తరువాయి)*

దుర్గపిన్ని మాట్లాడింది : ''నేనే నిర్మలా ... దుర్గపిన్నిని. ఇదుగో అనసూయ...యిది వరలక్ష్మి...''

నిర్మల చేతులు దుప్పటిలోంచి తీసి దుర్గపిన్ని చెయ్యి పట్టుకొని ఏదో అనబోయింది. కాని మాటలు రాలేదు. మాటలు రానందుకు నిర్మల కళ్లలో ఆశ్చర్యం, భయం.

పిన్ని వెంటనే అంది. ''డాక్టర్‌గారూ ! నిర్మల మాట్లాడలేకపోతోందండీ...''

డాక్టర్ ముందుకొచ్చి ఆమెని పలకరించేడు. నిర్మల పెదవులు కదిలేయేతప్ప మాటలు రాలేదు. డాక్టర్ ఆమె నోటిని, ముఖ కండరాలనీ పరీక్షించేడు. తరవాత సంచీలోంచి ఒక ఇంజక్షన్ తీసి సిరంజిలో కెక్కించి నిర్మల కిచ్చేడు. అదయాక నిర్మల తండ్రిని పిలిచి బయటకు తీసుకవెళ్లేడు.

జానకమ్మ రాగాలు ఆరంభించింది. నాకు దుఃఖం కట్టలు తెంచుకుంది. కాని నా కళ్ళలో నీరు చూస్తే నిర్మల మరింత భయపడిపోతుంది.

నిర్మల నా చెయ్యికోసం చేతులు జాచింది. నేను నిర్మల మంచంమ్మీద కూర్చొని నిర్మల చెయ్యి అందుకున్నాను. నిర్మల దేనికోసమో వెతుకుతోంది.

''ఎవరు కావాలి నిర్మలా ? కోతి కావాలా?'' అని అడిగేను.

నిర్మల చిరునవ్వునవ్వి, నా చెయ్యి మెల్లిగా నొక్కింది.

రామకృష్ణకేసి చూసి ... ''మిమ్మల్ని పిలుస్తోంది...'' అన్నాను.

అందుకోసమే ఎదురుచూస్తున్న రామకృష్ణ నిర్మలకి ఎదురుగా వెళ్లి అన్నాడు — ''నిర్మలా... ఇదుగో ... నీ కోతిని వచ్చేను...మాట్లాడవూ ?'' ఆమె చెవులకే వినబడేలా.

నిర్మల కళ్లలో కోటి దీపాలకాంతులొక్కసారిగా వెలిగేయి. రామకృష్ణ చేతులు పట్టుకుంది. ఆమె పెదవులు మాటలులేకుండా కదిలేయి.

జానకమ్మ గోల విపరీతంగా వుంది. ''అయిపోయింది దేవుడా...అయిపోయింది ... దాని గొంతు పడిపోయింది దేవుడో — ఇంక నాకూతురు నాకు దక్కదు తండ్రో !''

ఆమె ఏడుపుగోల భరించలేక ఆమెని దుర్గ బయటకు తీసుకవెళ్లింది. ''నిర్మల నిక్షేపంలా వున్నప్పుడు దాని గురించేమన్నా ఆలోచించేరా ? అదీ స్థితికి వచ్చేక నెత్తీనోరు కొట్టుకొని ఏం లాభం ? ఇక్కడ ఏడ్చి దాని మనస్సు పాడుచెయ్యకండి— పిల్లల్ని కనగానేసరా ? వాళ్లకో మనసుంటుందనీ, వాళ్లని అర్థంచేసుకొనే అవసరం తల్లిదండ్రుల కుందనీ గ్రహింపు లేకపోయేక ఇప్పుడేడ్చి ఏం లాభం ?''

నిర్మల ఏదో చెప్పాలని ప్రయత్నిస్తోంది. కాని మాటలు రావడంలేదు. మాట్లాడలేక పోతున్నందుకు ఏడుస్తోంది. నా చీరచెంగుతో ఆమె కన్నీరు తుడిచేను. ''ఛా! ఏడవకమ్మా ! నువ్వు త్వరలోనే కోలుకొని లేచి తిరుగుతావు !'' అని సముదాయించేను. ఆ మాటలకి ఆమెలో ఉత్సాహం కలిగింది.

రామకృష్ణ ఆమెతో మెల్లిగా మాట్లాడ్డం ఆరంభించేడు — ''చూడు నిర్మలా ! నేనూ అనసూయా వచ్చేం — యింక వేగం కోలుకోవాలి నువ్వు! నువ్వు మరే బెంగా పడక్కర్లేదు — నే వచ్చేసేనుగా — నిన్ను నాతో తీసుకపోతాను — మన యింటికి వెళ్లిపోదాం...'' కన్నీరాపుకుందుకు ప్రయత్నిస్తూ అన్నాడు ఆమె చెయ్యి నిమురుతూ—

మనిషి యొక్క ఆత్మ అన్నింటికన్నా గొప్పది — దానికి శరీరంతోనూ, జ్ఞాన, కర్మేంద్రి

ములాలతో సంబంధం లేదుట — రామకృష్ణ ఆత్మ, నిర్మల ఆత్మతో మాట్లాడుతున్నది. కాని విచారకరమైన సంగతేమిటంటే — ఈ శరీరమూ, జ్ఞాన కర్మేంద్రియాలూ లేకపోతే మనిషికీ, మనిషికీ మధ్యనున్న మమతల వంతెన మాయమైపోతుంది. నిర్మల శరీరాన్నీ, మనస్సునీ, బుద్ధినీ, యధాస్థితికి తెద్దామని మానసికంగా ప్రయత్నిస్తున్నాడు రామకృష్ణ—

అందరూ మంచంచుట్టూ మూగివున్నారు— రామకృష్ణని కాని, నన్ను కాని, నిర్మల చేతులు వదిలి దూరంగా పొమ్మనలేదెవ్వరూ. మా శరీరాల లోంచి ఏదో శక్తి ఆమెలోకి ప్రవహిస్తున్నట్టు ఆమె కళ్లలోని వెలుగు తెలుపుతూనే వుంది — నా చుట్టూ ఎవరున్నారో నేను గమనించటం లేదు — నేను చూస్తున్నది నిర్మల ముఖంలోకి — ఆమె రామకృష్ణా చేసుకుంటున్న సంభాషణని గమనిస్తున్నాను. వారి మనసులలో పాత జ్ఞాపకాలన్నీ మెదులుతున్నాయి — ఎన్నో సంకేతాలు...

ప్రే కబుర్లు ఆనాటివి... ఒకరినొకరు చూసు గా గుర్తుకొస్తున్నాయి.

ఏదో అందామనీ, ఏదో చెప్పాదామని ప్రయత్ని ంది నిర్మల — కాని చెప్పలేకపోతోంది. వేడి ప్లాస్కు తెచ్చి నన్ను పట్టమంది నిర్మల తల్లి — ఏ గ్లాసు అందుకొని, చెంచాతో ఆమె నోట క్కొక్క చెమ్చాడూ వేసేను — నాలుగయిదు ంచాలు తాగాక వద్దని తల ఊపింది — పట్టడం మానేసేను — వెంటనే తాగిందేదో వాంతయి పోయింది —

"ఏమీ ఇమడ్డం లేదమ్మా..." అంది జానకమ్మ —

నేను లేవబోయేను తక్కినవాళ్లకి చోటిద్దామని — కాని నిర్మల నా చెయ్యి వదలలేదు. ఆమె మనసులోని ఉద్దేశం గ్రహించడానికి రామకృష్ణ ప్రయత్నించేడు... "ఏం కావాలి నిర్మలా ?" ఆమె పెదవులు కదిలేయి.

రామకృష్ణ దుర్గపిన్నివేపు అర్థవంతంగా చూసేడు — నాకూ అర్థమయింది — మంగళ సూత్రం అడుగుతున్నాడు రామకృష్ణ — యిప్పుడే వుంది అసలు యుద్ధం.

దుర్గపిన్ని తెలివిగా అంది... "పిల్ల ఏదో కావాలంటోందే ? చెప్పలేకపోతోంది దానికేదో తీవ్రమైన కోరికుండిపోయింది జానకమ్మా !"

"ఏమోనమ్మా ! ఎలా తెలుసుకోగలను ?" ఏడుస్తూ అంది జానకమ్మ —

అప్పుడు కనకదుర్గ జానకమ్మని పక్కకి తీసుకవెళ్లి ఆమెతో మాట్లాడింది మెల్లిగా. వారిద్దరిమధ్యా గుసగుసలు నడిచేయి కొంతసేపు — తరవాత జానకమ్మ తన భర్తని పిలిచింది — ముగ్గురూ కొంతసేపు మాట్లాడుకున్నారు — తరవాత మానుగారిని పిలిచి మాట్లాడేరు జానకమ్మ భర్త. అందరూ బయటికెళ్లేరు. కొంతసేపయ్యేక తిరిగివచ్చేరు — నిర్మల తండ్రి అన్నాడు... "అడిగి చూడండి ! అదే దాని కోరికైతే మాకేం అభ్యంతరంలేదు."

నిర్మల దగ్గరగా వెళ్లి అడిగింది జానకమ్మ "ఏం కావాలో చెప్పు తల్లీ ?"

నిర్మల ఏదో అనబోయింది పెదవులు కదుపుతూ. తన మెడలోని మంగళసూత్రం చూపిస్తూ జానకమ్మ అడిగింది నిర్మలని... "ఇదా తల్లీ కావాలి ?... ఇదేనా ?"

నిర్మల ఆశ్చర్యపోయింది — తరవాత సిగ్గు పడింది — ఆమె ముఖంమ్మీదికి చిరునవ్వు వచ్చింది... కళ్లు దించుకుంది —

వెంటనే జానకమ్మ అంది. "అవునమ్మా... నువ్వన్నదే నిజం ! ఒక పుస్తెలతాడు తెప్పించండి — నా పిల్ల నాకు దక్కితే అంతే చాలు... వెంకటరమణా... తండ్రీ !" అంటూ ఆదరా బాదరగా పరుగుతీసింది —

"ఒక పసుపుతాడుకి పసుపుకొమ్ము కట్టి తీసుకరండి చాలు..." అంది దుర్గపిన్ని.

పావుగంటలో పసుపుతాడూ, దానికి నల్ల పూసలూ, తాళిబొట్టూ కూడా వచ్చేయి — జానకమ్మ తన మంగళసూత్రాలలోని ఒక తాళిబొట్టు తీసి గుచ్చింది.

అది చేతికి వచ్చేక, కనకదుర్గే ముఖ్య భూమిక నిర్వహించింది.

అక్కడ వున్న అందరిలోనూ ఏదో ఉత్సాహం! హడావిడి... పరుగులు — అక్షింతలు కలిపి తెచ్చే రెవరో —

"రామకృష్ణా! ఈ మంగళసూత్రం చేతిలోకి తీసుకోనాయనా !" కనకదుర్గ, మంగళసూత్రాన్ని రామకృష్ణ కిచ్చింది.

రామకృష్ణ చేతిలోని మంగళసూత్రాన్ని చూడగానే ఆశారేఖలు నిర్మల ముఖంమ్మీద కనిపించేయి — నిర్మల లేచి కూర్చోబోయింది. "లేవకమ్మా — అలానే పడుకో !" అంది దుర్గ.

నిర్మల ముఖాన్ని వేడినీళ్లతో కడిగి, జుట్టు సర్ది, కుంకుమబొట్టు పెట్టింది దుర్గపిన్ని —

**జరిగిన కథ-17 :** అనసూయ అక్కకీ, అన్నకీ పెళ్ళయిపోతుంది తండ్రి రిటైరై పోతాడు అనసూయ పెళ్ళి ఆ యింట్లోవారికి ఓ సమస్య ఎస్ ఎస్ సి పాసయిన అనసూయ చదువు ఆగిపోతుంది ఆర్థిక యిబ్బందులవల్ల ఆడపిల్లలకి చదువనూ, వ్రాయనూ నేర్పించటానికి బడి పెడ్తారు అనసూయా కనకదుర్గ చిన్నతనంలోనే వైధవ్యం పొందిన స్నేహితురాలు నిర్మల చేత మెట్రిక్‌కు కట్టిస్తుంది అనసూయ భర్త వదిలేసిన సుగుణతో పరిచయమవుతుంది అనసూయకి సుగుణ అక్క సంధ్య రంగారావ్‌ను ప్రేమించిన సంధ్య అతణ్ని నమ్మి తన శీలాన్ని అర్పిస్తుంది నువ్వు నాకు ఉంపుడుకత్తెగా వుంటానంటేనే నీ అక్కను పెళ్ళాడతానన్న రంగారావ్ మాట వినదు సుగుణ. సంధ్యకి పన్నవకుమార్ అనే అతనికీ అక్రమ సంబంధం సృష్టిస్తాడు రంగారావ్ రంగారావ్ వేసుకున్న పథకం ప్రకారం సుగుణకి అతనితో పెళ్ళవుతుంది. సుగుణ తనని మోసం చేస్తుందేమోనని ఆమెని హింసించటం ప్రారంభిస్తాడు రంగారావ్ సంధ్యని పెళ్ళాడిన రంగారావ్ నిన్ను పెళ్ళాడిన రంగారావ్ నేను కాదంటాడు సుగుణతో. ప్రక్కింటి పిల్లమ్మ కూతురు అలివేణి తను రవీంద్ర అనే అబ్బాయిని ప్రేమించానని చెప్తుంది అనసూయతో పిల్లలు లేని రేవతి తన సవతికొడుకు జడ్డివాడికి నిన్ను చేసుకుంటాను అనటంతో హడలిపోతుంది అనసూయ. నిర్మల చిన్ననాటి స్నేహితుడు 'కోతి' కనిపిస్తాడు నిర్మలని పెళ్ళి చేసుకుంటానంటాడు 'కోతి'' నిర్మలని కోతి పెళ్ళి చేసుకుంటానన్నాడన్న మాట విన్న నిర్మల తల్లిదండ్రులు మండిపడటమే కాకుండా ఆమెని మరో వూరు పంపించేస్తారు వివాహితుడైన రవీంద్రవల్ల గర్భం పొందుతుంది అలివేణి అలివేణిని రవీంద్ర పెళ్ళాడాడని చెప్పి అతని తల్లి తండ్రుల కప్పగిస్తుంది కనకదుర్గ చావుబ్రతుకుల్లో వున్న నిర్మల కోరిక తీర్చడంకోసం ఆమెకి తాళి కడతానంటాడు రామకృష్ణ

తరవాత రామకృష్ణతో అంది '' వేసీనాయనా మూడు ముళ్ళూ...''

నిర్మల తలని ఎత్తి పట్టుకున్నాం —

రామకృష్ణ నిర్మల మెడచుట్టూ మంగళ సూత్రాన్ని పోనిచ్చి, మూడు ముళ్ళూ వేసేడు

అందరూ ఆ నూతన వధూవరుల మీద అక్షింతలు జల్లేరు —

నిర్మల వెక్కి వెక్కి ఏడవనారంభించింది రామకృష్ణ చెయ్యి పట్టుకొని — అందరం ఆనందంతో ఏడ్చేం మనసులోని బరువు తొలగిపోగా—

''ఈ పని ఆనాడే చెయ్యవల్సిందే తల్లీ !'' అంటూ వాపోయింది జానకమ్మ —

రామకృష్ణ, నిర్మలలు మూగగా ఏం మాట్లాడుకున్నారో నేను మరి రాయదలచుకోలేదు — నిర్మల కోరిక నెరవేరింది — రామకృష్ణ కల ఫలించింది — అంతకన్న ఆ ఇద్దరికీ కావల్సిందేమీలేదు —

వారిద్దరినీ వదలి మేం బయటకొచ్చేం —

అప్పుడు నాకు నిర్మల స్థితి నిజంగా తెలిసింది — నిర్మల తండ్రి వలవలా ఏడుస్తున్నాడివతల — ఆయనన్నాడు నాతో .. ''దాని ఆఖరి కోరిక మీవల్ల తీరింది — నా పాపానికి నిష్కృతి లేదు తల్లీ .. లేదు !''

''ఆఖరి కోరికా ? ఏమిటంటున్నారు మీరు ?'' అదిరిపడి అడిగేను

''అదంతే తల్లీ ... అదంతే !''

నిర్మల ఆఖరిదశలో వుందిట ఆ ఇంజక్షను, దాని బతుకుని కొంతకాలం పొడిగించడానికి డాక్టరు చేసిన ఆఖరి ప్రయత్నం

కాని, నిర్మల బతికితీరుతుందని నాకు ఆశ మాత్రం వుంది

ఆ ఉదయం ఏడుగంటలకి రామకృష్ణ నిర్మలకి తాళికట్టగా నిర్మల సుమంగళి అయింది రామకృష్ణ నిర్మల పక్కనే కూర్చున్నాడు. అతడేం మాట్లాడేడో, ఆమె ఏం విందో దేవుడికెరుక మనుష్యులు లోనికి వెళ్తున్నారు .. వస్తున్నారు ఆమె పరిస్థితి గమనిస్తున్నారు — కళ్ళు ఒత్తుకుంటున్నారు.

నేను మాత్రం లోనికి వెళ్ళలేదు నిర్మల బతకదని ఆమె తండ్రి అనేసరికి నా గుండె బేజారెత్తిపోయింది. ఇక్కడే యిలా కూమనే దేవుణ్ని ప్రార్థిస్తే నిర్మల దక్కుతుందని కళ్ళు మూసుక కూర్చున్నాను

ఎనిమిదిగంటలకి రామకృష్ణ నా భుజం తట్టి ''నిర్మల నిన్ను పిలుస్తోంది.. '' అన్నాడు

సంతోషంగా లేచి — ''మాట లొచ్చేయా?'' అన్నాను

''లేదు ! కళ్ళతో చెప్తోంది . . అనసూయ కావాలా ? అంటే ఔనంది.''

లోపలకి వెళ్ళేను. నాకేసి చూసి కళ్ళతో నవ్వింది ఏదో చెప్పాలనుకుంటోంది — ఇప్పుడు ఆమె పెదవులు కదలటంలేదు

మంచంమ్మీద కూర్చొని అడిగేను. ''నిర్మలా ... నేనూ ... అనసూయని .. ఏం కావాలమ్మా ?''

నిర్మల చూపులు రామకృష్ణమీదా, తరవాత నామీదా వాలేయి. చాలాసార్లు చూపులు నామీంచి అతడిమీదికీ, అతడిమీంచి నామీదకీ మరల్చింది

''ఏం కావాలి నిర్మలా ... చెప్పమ్మా ?''

మళ్ళా ఆ చూపులు మా యిద్దరిమీదా నిలిచేయి. నాకేం అర్థంకాలేదు.

''పిన్నీ! నిర్మల ఏమిటి అంటోందో అర్థమయిందా?'' దుఃఖం గొంతులో పెల్లుబకగా అడిగేను.

రామకృష్ణ మరి నిగ్రహించుకోలేక, భళ్ళున ఏడ్చేసేడు. ''నిర్మలా! అప్పగింతలు పెట్టేస్తున్నావా? నువ్వు లేనిదీ నేను బతకలేనే .. నీ కోతిని వదిలిపోకే!'' అతని ఏడుపు విని అందరూ గదిలో కొచ్చేరు

నిర్మల నాకేసి విచారంగా, జాలిచూపుల చూసింది నేను ఆమె చేతులు నా చేతులలో తీసుకున్నాను ఆమె ఒళ్ళు చలవయికమ్మింది చేతులు కట్టెల్లా వున్నాయి ఆ జాలి చూపులతో ఏదో చెప్పబోయింది — రామకృష్ణ దుఃఖం, ఆమె చూడలేకపోతోంది ఆమె కన్నీరు నేను తుడుస్తున్నాను కళ్ళతోనే ఏదో చెప్పాలని ఆమె ప్రయత్నం

కనకదుర్గపిన్ని నాచెవిలో చెప్పిందప్పుడు ''నువ్వు చెప్పినట్టు చేస్తాను నిర్మలా అని అనసూయా — రామకృష్ణని అందరం చూసుకుంటాం అని చెప్పమ్మా !''

నాకు దుఃఖంవల్ల నోరు పెగలలేదు ఏడుస్తూ అన్నాను . . ''అలాగే నిర్మలా ! నువ్వు చెప్పినట్టే చేస్తాను — నీ కోతికేమీ భయంలేదు !'' అన్నాను

నిర్మల ఆఖరుసారిగా మా యిద్దర్నీ చూసి కళ్ళతో నవ్వింది

అలా తదేకంగా కళ్ళతో నవ్వుతూనే ఉండిపోయింది !

చావు ఎలా వుంటుందో ఎవరూ చూడలేదు శరీరంలోంచి ప్రాణం ఎలా పోతుందో చూసినవాళ్ళకీ తెలీదు ప్రాణం పోయినవాళ్ళకి తెలీదు నిర్మల యింకా బతికేవుందని అందరం అనుకున్నాం కాని ఆమె దేహంలోని జీవుడు పరమాత్మ దగ్గరికి వెళ్ళిపోయినట్టు తెలిసిరాలేదు వెంటనే

తెలిసేక మిన్నే విరిగి మీద పడినంతగా శోకాలతో ఇల్లు నిండిపోయింది

నిర్మల ఈ మానవ పంజరంలోంచి శాశ్వతంగా ఎగిరిపోయింది స్వేచ్ఛని వెతుక్కుంటూ!

## 23

నిర్మల జీవితం ఎందుకలా అయిందంటే అందుకు ఏ సంజాయిషీ దొరకదు

ప్రపంచంలో ఎన్నో కోట్లమంది స్త్రీలున్నారు ఒక్కొక్కరి జీవితం ఒక్కొక్కవిధంగా వుంటోంది. ఒకరి జీవితానికీ మరొకరి జీవితానికీ ఎక్కడా పోలికలుండవు. మనిషికీ మనిషికీ పోలికలుండవుకదా. చెట్టుకి ఎన్నో వేల ఆకులుంటాయి ఏ రెండాకులు కూడా ఒక్కలా వుండనేవుండవు కాని బయటకి ఆకులన్నీ ఒకేలా కనిపిస్తాయి. ప్రతి మానవ జీవితమూ ప్రత్యేకమైనది దానికి నమూనా మరెక్కడా దొరకదు. ప్రకృతి తనని తాను అనుకరించదు. ప్రతి క్షణం భిన్నమైన జీవితాన్ని సృష్టిస్తూ వుంటుంది అందులో నిర్మల బతుకు ఒకటి

నిర్మల ధన్యురాలు తన పట్టుదల నెగ్గించుకొని మరీ పోయింది. కాని ఆమె కోరిక నెరవేరేక తను ప్రేమించి పెళ్ళాడిన మనిషితో ఈ భూమిమీద వార్ధక్యం వచ్చేవరకూ కాకపోయినా, కొన్నేళ్ళయినా జీవితం గడిపే అవకాశం ఆమెకు లేకపోయింది. ఆ అవకాశమే ఆమె కుండాలంటే, ఆమెకు రామకృష్ణచేత పుస్తె కట్టించుకొనే అవకాశం వుండకపోనేమో నిర్మల ప్రాణం

[32 వ పేజీ చూడండి]

# "ముందు కథ చెప్పండి : సీత పాత్ర నచ్చితే వేస్తాను

## జి. వి. జి. పేజీ

**ఈ** సినిమా ఫీల్డులో సలహా ఇవ్వడంకన్నా తెలివితక్కువ పని మరేదీ వుండదు.

సెట్ బయట కూర్చొనున్న ఒక కొత్త తారతో ఒక నిర్మాత "ఫస్టు పిక్చరయినా — మా పిక్చర్‌లో చాలా బాగా చేస్తున్నావమ్మాయ్. నీకు మంచి పేరొస్తుంది. ఇంకే నిర్మాతయినా నిన్ను బుక్ చేయడానికి వస్తే, ఆయన తీయబోయే కథేమిటో పూర్తిగా తెలుసుకో. అందులో నీ పాత్ర ఏమిటో ముందే బాగా తెలుసుకో. నీ మనసుకు బాగా నచ్చితేనే ఒప్పుకో" అన్నాడు. "అలాగేనండి" అందా అమ్మాయి. "ఈ పిక్చర్ బాగా పోతే నెక్స్టు ఒక పౌరాణికం తీయాలని వుంది. నువ్వు సీత వేషం వేస్తానంటే లవకుశ తీస్తాను. ఏమంటావ్ ?" అన్నాడా నిర్మాత. "ముందు కథేమిటో చెప్పండి. నాకా సీత పాత్ర నచ్చితే తప్పకుండా వేస్తాను." అందా తార. అంతే. ఆ నిర్మాత అమాంతంగా అవాక్కయి పోయాడు !

నేడు చలనచిత్ర పరిశ్రమ ఎందుకీ స్థితిలో వుందో అందరికీ తెలుసు. పరిష్కార మార్గాలు కూడా అందరికీ తెలుసు. అంచేత, ఎవరికీ సలహాలు ఇవ్వనక్కర్లేదు. ఎంచేతంటే — ఎవరిదారి వారిది. పరిశ్రమ దారి పరిశ్రమది.

దాదాపు పదిహేనేళ్ల క్రితం ... ఒకరోజు నేను ఓ స్టుడియోకు వెళ్తే, ఓ నిర్మాత కనిపించి, "సార్ ! ఒక కొత్త అమ్మాయిని మా చిత్రంలో హీరోయిన్‌గా పరిచయం చేస్తున్నాం. సెట్‌లో వుంది. వెళ్లి చూసిరండి." అన్నాడు.

సెట్‌లోకి వెళ్లేసరికి లైటింగ్ ఏర్పాట్లు జరుగుతున్నాయి. డైరెక్టర్ ఓ మూల కూర్చొని సీరియస్‌గా స్క్రిప్టు తిరగేస్తున్నాడు. మరోమూల ఉల్లిపొరల్లాంటి పరదాల చాటున ఆ కొత్త హీరోయిన్ తన తల్లితో కూర్చొనుంది ఓ సోఫాలో. దగ్గరి కెళ్లాను. ఇద్దరూ చెమ్మగిల్లిన తమ కళ్లను చీరకొంగుతో అద్దుకుంటున్నారు. నాకేమీ పాలుపోలేదు కొన్ని క్షణాల వరకు. అనంతరం నేను ఫలానా సినిమా మాస పత్రిక సంపాదకుణ్ణని పరిచయం చేసుకొని, "ఏదేమిటమ్మా, శుభమా అని ఈరోజే తొలిసారిగా కెమెరా ముందు నటిస్తున్నావ్ ? కొంపతీసి మొదట్లోనే విషాదకరమైన సన్నివేశం ఏమీ తీయడంలేదుకదా ?" అన్నాను.

"ఏమని చెప్పమంటారు ?" అందా కొత్త తార బావురుమంటూ. "కడుపు చించుకుంటే కాళ్ళమీద పడుతుంది" అని వాపోయింది తల్లి.

"ఏమిటమ్మా ? ఏమైంది ?"

తల్లి గద్గద స్వరంతో "మేమేం లేనివాళ్ళం కాము. ఈ పిచ్చిపిల్ల పోరు పడలేక యింత దూరం వచ్చాం. ఈ అమ్మాయి నాన్నకు లారీలు వున్నాయి. ఏదో ఈ అమ్మాయి చిన్నప్పట్నించీ సినిమాలు తెగ చూసేది. సంగీతం, డాన్సు నేర్పించాం. ఇక సినిమాలలో నటించాలని మమ్మల్ని వేధించుకు తినడం మొదలెట్టింది. ఒక పెద్ద మనిషి ద్వారా ఈ చిత్ర నిర్మాత పరిచయ మయ్యారు. పాపం, ఆయన అవకాశమిచ్చారు. కాని, ఈ డైరెక్టర్ మాత్రం చాలా అసాధ్యుడిలా వున్నాడు. ఇందాక ఓ చెడ్డకోర్కెను వెలిబుచ్చాడు. మేం జవాబివ్వకపోయేసరికి అదేపనిగా అమ్మాయి మీద చిరచిర లాడడం మొదలెట్టాడు. ఏదో డైలాగు ఆయన చెప్పినట్లు అమ్మాయి చెప్పలేక పోయిందని 'మీరంతా సినిమాల్లో నటించడానికి ఎందుకొస్తారు ?" అని అందరిముందు కేక లెట్టాడు. ఈ పరిస్థితిలో అమ్మాయి యింకో మూడు నెలలపాటు ఈ చిత్రంలో ఎలా యాక్టు చేయగలదు ? అమ్మాయిని రోజా పువ్వులా చూసు కొని, కంటికి రెప్పలా కాచుకు పెంచాం. ఇప్పుడు మమ్మల్నేం చేయమంటారు చెప్పండి. ఈ డైరెక్టర్‌కు యింత చెడ్డమనసు వుంటుం దనుకోలేదు సుమండీ !" అంది.

"చెడ్డమనసు సంగతేమిటోగాని, యితను కాస్త చాదస్తపు మనిషని మాత్రం నాకు బాగా తెలుసు. కొంత కాలంపాటు మా పక్క వాటాలో వుండేవాడు. పాపభీతి లేకపోయినా దైవచింత గలవాడు. మీ అమ్మాయికి ఏదో వ్రతముందనో, లేక ఏ ప్రార్థన వుందనో చెప్పండి. మూడు మాసాలలో ఆ వ్రతమేదో పూర్తయ్యాకగాని మీ అంగీకారం తెలియజేయలేమని చెప్పండి. ఇట్టే నమ్మేస్తాడు. అతని స్వభావం నాకు బాగా తెలుసు. మూడు నెలల్లో ఈ పిక్చర్ పూర్తయి పోతుందన్నారుగా ? ఆ తర్వాత ఎవరి దారి వారిది" అని సలహా యిచ్చి, సెట్ బయటకు

[34వ పేజీ చూడండి]



'దొంగలకు దొంగ'లో జయప్రద, కృష్ణ

# గెలుచుకునేందుకు 500 చీరలు!




## రూ. 135/- ఖరీదైన లక్ష్మి-విష్ణు 100% టెరీన్ చీరను గెలుచుకోండి.

# గ్లాక్సోస్-డి

## "యువర్ బిజీ డే" పోటీలో పాల్గొనండి

స్త్రీలకోసం! ఈ క్రింద యిచ్చిన ఎంట్రీ కూపన్‌లో మీరు యింట్లో చేసే 5 పనులు యివ్వబడ్డాయి. మీరు చేయ్యవలసిందల్లా, మీరు రోజూ యింట్లో చేసే పనుల్లో మీ ఉద్దేశ్య ప్రకారం పనులు ప్రతి గంటకు మీ శక్తిని అన్నిటికన్న ఎక్కువగా ఖర్చు చేస్తాయో వాటిని ఆ వరుస క్రమంలో పెట్టటమే. ఉదాహరణకు, మీ ఉద్దేశ్యంలో ఉతకటంవలన ఎక్కువ శక్తి ఖర్చవుతుందని అనిపిస్తే, పక్కనున్న గడిలో (1) అని గుర్తు పెట్టండి, మరి అదే విధంగా (5) నంబరు వచ్చేవరకూ అలాగే గుర్తిస్తూపోండి. తర్వాత యిచ్చిన వాక్యాన్ని పూర్తి చేసి, గ్లాక్సోజ్-డి 400 గ్రా. ప్యాక్ యొక్క పైభాగాన్నీ, క్యాష్ మెమోనూ ఎంట్రీ కూపన్‌కు జతపరచి పోస్టు చెయ్యండి. మీరెన్ని కావలిస్తే అన్ని ఎంట్రీలు పంపవచ్చును. బహుమతి పొందగల క్రమం స్వతంత్రులైన నిర్ణేతలచే నిర్ణయించబడుతుంది. వారిదే తుది నిర్ణయంగా, అమలు జరుపబడుతుంది.

ఇది ఎంతో తేలిక. మరి మీకు యీ 500 చీరల్లో ఒకటిగాని అంతకన్న ఎక్కువగాని గెలుచుకునే అవకాశం ఉంది!

ఇంటిపని మీకు అలసట కలిగిస్తుందని మీకు తెలుసు. అందుకు కారణం మీ శరీరం యొక్క శక్తికి మూలాధారమైన గ్లూకోజ్‌ని మీరు కోల్పోవడమే.

గ్లాక్సోస్-డి మీకు తక్షణమే శక్తిని ఇస్తుంది.

### షరతులు. నిబంధనలు

1. ఎంట్రీ కూపన్, దిద్దటం, చెరపటం మార్పులు లేకుండానూ నింపబడాలి, లేక పోయిన పక్షంలో, అది పోటీకి అనర్హమవుతుంది.
2. ఈ పోటీ విషయంలో జడ్జీల నిర్ణయమే తుది నిర్ణయం. ఈ రీత్యా ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.
3. ఎంట్రీలు ఆలస్యంగా అందినా, అసలే అందక పోయినా, కనబడకపోయినా, వాటికి బాధ్యత వహించబడదు.
4. గ్లాక్సో లేబరేటరీస్ (ఇండియా) లిమిటెడ్ మరియు డికున్హా ఎసోసియేట్స్ లిమిటెడ్ సంస్థల డైరక్టర్లూ, ఉద్యోగులూ లేదా ఆ డైరక్టర్లకూ బంధువులూ, ఉద్యోగులూ యీ పోటీలో పాల్గొనుటకు అర్హతలేదు.
5. ప్రతి ఎంట్రీతోనూ 400 గ్రా. గ్లాక్సోస్-డి ప్యాక్ యొక్క పైభాగము, క్యాష్ మెమో తప్పనిసరిగా జతపరచాలి.
6. ఎంట్రీలను ఇంగ్లీషు, తెలుగు, హిందీ, బెంగాలీ, తమిళు, కన్నడ, మలయాళం, గుజరాతీ లేదా మరాఠీ భాషలలో మాత్రమే రాయాలి.
7. పోటీ ముగింపు తేదీ : 30 సెప్టెంబరు, 1977.

మీ ఎంట్రీలను వెంటనే పంపండి




## ఎంట్రీ కూపన్

APK

# గ్లాక్సోస్-డి®

## "యువర్ బిజీ డే" పోటీ



వీటిలో అన్నిటికన్న మీ ఉద్దేశ్యంలో ప్రతి గంటకు ఎక్కువ శక్తి ఖర్చు చేసే పనుల క్రమాన్ని 1 నుంచి 5 దాకా గుర్తించండి.

☐ ఉతకటం ☐ వంటచెయ్యడం ☐ కుట్టుపని ☐ ఇల్లు తుడవడం ☐ దులిపి, తుడవటం

పేరు : శ్రీమతి/కుమారి........................................

ఎడ్రసు........................................

........................................

ఈ పోటీకి సంబంధించిన నిబంధనలకూ. షరతులకూ నేను కట్టుబడి ఉంటాను. ....................

ఈ వాక్యాన్ని 15 మాటలకన్నా మించకుండా ఉండేలా పూర్తి చెయ్యండి: సంతకం

నాకు శక్తి కావలసివచ్చినప్పుడు, గ్లాక్సోజ్-డి........................................

........................................

........................................

# గ్లాక్సోస్-డి

## తక్షణ శక్తి కోసం

మీ ఎంట్రీలను "యువర్ బిజీ డే" పోటీ, పోస్ట్ బ్యాగ్ నం. 10026, బొంబాయి 400 001కి పంపండి. dCA/GL/45 C Tel.

# సినిమా విశేషాలు

## అక్కినేనికి మూడు పాత్రలు

''నటసామ్రాట్''గారు మూడు పాత్రలను సమ్మతించడం, నిర్మాత తమ్మారెడ్డి కృష్ణమూర్తి గారికి ఎంత ఆనందకరమైన విషయమో, లక్షలాది ప్రేక్షకులకు అంతకు రెట్టింపు ఆనందాన్ని కలిగించే వార్త కూడా.

ఒకప్పుడు ఏ. వి. ఎమ్. వాళ్ళు ''దైవమగన్'' చిత్రాన్ని అక్కినేనికి చూపించి, తమిళంలో శివాజీవలె త్రిపాత్రలను వెయ్యమని కోరారు. ''ససేమిరాచెయ్యను'' అని చెప్పిన అక్కినేనిగారు, రవీంద్ర ఆర్ట్ పిక్చర్స్‌కు అంగీకరించడం శుభావహం.

ఈ సంవత్సరంలో ''హ్యాట్ ట్రిక్'' సాధించనున్న దర్శకుడు, తమ్మారెడ్డి గారి చిత్రానికి ఎంపికఅయ్యే అవకాశం ఎక్కువగా వినిపిస్తూంది.

## సెవంటీ సీటర్

''నటసామ్రాట్'' నాగేశ్వరరావు గారు, అన్నపూర్ణా స్టుడియోస్‌లో నిర్మించిన ప్రివ్యూ థియేటర్ ఆయన అందాల అభిరుచికి ప్రతిరూపంగా వుంది. డెబ్బయి సీట్లు వున్న ఆ థియేటర్ భాగ్యనగరంలోని నిర్మాతలకు అనుకూలంగా వుంటుంది. రష్ చూడడానికి, ప్రింటు తనిఖీ చెయ్యడానికి, ప్రివ్యూషోలు ప్రదర్శించడానికి ''అన్నపూర్ణ ప్రివ్యూ థియేటర్'' సానుకూలంగా వుంటుంది.

## భయంకర జంతువులనడుమ ఉపేంద్ర

మద్రాస్‌కు ఏభైమైళ్ళ దూరంలో వున్న తడ అడవుల్లో వున్నట్టుండి భయంకర జంతువులు ప్రత్యక్షమయ్యాయిట. పులి, సింహం, మొసలి, నాగుపాము, కొండచిలువ మున్నగు ప్రమాదకరమైన జంతువులు విచ్చలవిడిగా తిరుగుతూ, భయంకరంగా గర్జిస్తూ, నరమాంసంకోసం పడిగాపులు కాయడం మొదలెట్టాయట. ఈ విషయం ఉపేంద్ర అనే సాహసికునికి తెల్సింది. వాటి అంతేమిటో తేల్చాలని బయల్దేరాడు ఉపేంద్ర. మొండిగా, కసిగా తను నన్వేషించి వస్తున్న ఉపేంద్ర వునికిని పసిగట్టాయి జంతువులు. ఒక్కొమ్మడిగా కాకుండా, ఒక్కొక్కటిగా వెళ్ళి ఉపేంద్రను ఢీకొన్నాయి.



సమయస్ఫూర్తితో అన్నింటిని లొంగదీశాడు ఉపేంద్ర. భయంకర జంతువులతో ఉపేంద్ర సలిపిన పోరాటాలను అంకించినపుడు ఒళ్ళు గగుర్పొడుస్తుంది. ఈ సంఘటన జులై మొదటి వారంలో జరిగింది. ఇంత నేర్పుగా, ఓర్పుగా ఆ భయంకర జంతువుల్ని లొంగదీసుకున్న ఉపేంద్ర ఎవరో విచారిస్తే, ఇలా అని తెల్సింది. ''అతనొక వేటకాడని, అతని అసలు పేరు గిరిబాబని.'' గిరిబాబుకి, జంతువులకి సంబంధం ఏమిటి! అని మరికొంత వివరావికొస్తే, జయభేరి ఆర్ట్ పిక్చర్స్ వారు సినిమాస్కోప్‌లో నిర్మిస్తున్న ''దేవతలారా! దీవించండి'' చిత్రంలో తారసిల్లే సంఘటనల్లో కొన్నే పై నుదహరించినవి అని ద్యోతకమైంది.

ఆగస్టు 1 నుంచి 10 వరకూ జరిగే షూటింగ్‌తో ఈ బ్లాక్ అండ్ వైట్ స్కోప్ చిత్ర పూర్తవుతుంది. దసరా కానుకగా యీ చిత్రాన్ని విడుదల చేయాలని నిర్మాతల సంకల్పం.

రంగనాథ్, చంద్రమోహన్, గిరిబాబు, ఈశ్వరరావు, రంగారావు, హరిబాబు, అల్లు రామలింగయ్య, మాడా, సాక్షిరంగారావు, ప్రభ, జయమాలిని, అవిత, విజయలక్ష్మి ముఖ్య పాత్రలను పోషిస్తున్న ఈ చిత్రంలో కమర్షియల్ వేల్యూస్ చాలా వున్నాయి.

దక్షిణ భారత చలనచిత్ర చరిత్రలో ఒక బ్లాక్ అండ్ వైట్ చిత్రం సినిమాస్కోప్‌లో నిర్మింపబడటం ''దేవతలారా! దీవించండి''తోనే



'కన్నవారిల్లు'లో దీప

ఆరంభం. నల్లమలై అడవుల్లో, తడ అడవుల్లో చిత్రీకరించిన ఈ చిత్రంలోని దృశ్యాలు ఇంగ్లీషు చిత్రాల్ని జ్ఞప్తికి తెస్తాయి. చక్రవర్తి కూర్చిన బాణీలు, జంధ్యాల మాటలు, రంగారావు శిల్ప సౌందర్యం, కందస్వామి కూర్పు ప్రత్యేక శోభను చేకూర్చడమేకాకుండా, కొమ్మినేని కథకు చక్కటి రూపాన్నిస్తున్నాయి. ఈ చిత్రానికి స్టీరియోఫోనిక్ సౌండ్ వాడడం మరొక ఆస్పెక్ట్.

కొమ్మినేని శేషగిరిరావు కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం సమకూరుస్తున్న ఈ స్కోప్ చిత్రానికి మాగంటి వెంకటేశ్వరరావు, అన్నంగి నాగేశ్వరరావు నిర్మాతలు. జి. జి. సత్యనారాయణరావు, వై. శేషగిరిరావు సహనిర్మాతలు. తారకరామా, నవభారత్, శ్రీతారకరామా ఈ చిత్రానికి పంపిణీదారులు.

## రెండు భాషల్లో మహేష్ కొత్త చిత్రం

లావణ్య పిక్చర్స్ స్థాపించిన తరువాత ''అనగనగా ఒక తండ్రి...ముగ్గురు మూర్ఖులు... గంగ ... యమున ... సరస్వతి'' చిత్రాలు మహేష్‌గారి నుండి వచ్చాయి.

మూడో చిత్రానికి ఆయనే దర్శకుడు. ''గంగ ... యమున ... సరస్వతి'' చిత్రాన్ని చూచిన ఆత్మీయులు, విమర్శకులు మహేష్‌గారి తొలి ప్రయత్నాన్ని అభినందించి, విజయాన్ని ఆకాంక్షించారు.

ఆయన తన వాయిగో ప్రయత్నంగా రెండు భాషల్లో చిత్ర నిర్మాణానికి నిర్ణయించారు.

తెలుగు, కన్నడ భాషల్లో రూపొందబోయే ఆ చిత్రానికి కథ, మాటలు, చిత్రానువాదం, దర్శకత్వం వంటి విలువయిన బాధ్యతలను మహేష్‌గారే నిర్వహిస్తారు. చిత్రం పేరు ముగ్గురు మూర్ఖురాళ్ళు.

## అయిదుగు రమ్మాయిల కన్నవారిల్లు

అంజలీ పిక్చర్స్‌వారి ''కన్నవారిల్లు'' చిత్రం పూర్తయింది. ఈ చిత్రంలో అంజలీదేవి, సత్యనారాయణ భార్యాభర్తలుగా నటిస్తున్నారు. వారిద్దరికి అయిదుగు రమ్మాయిలు. అయిదుగు రల్లుళ్ళు. దీప, వెన్నిరాడై నిర్మల, వై. విజయ, రజని, విజయలక్ష్మి అమ్మాయిలుగా, నారాయణ రావు, శరత్‌బాబు, గిరిబాబు, ఈశ్వరరావు, మోహన్‌బాబు అల్లుళ్ళుగా నటిస్తున్నారు. ఒక మిడిల్ క్లాస్ ఫామిలీలో జరిగిన ఇతివృత్తానికి కథారూపమే ''కన్నవారిల్లు''.

ప్రత్యేక ఆత్మ ప్రత్యగాత్మ స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో తయారైన ఈ చిత్రంలో కామెడీ పార్ట్‌ను నాగేష్, అల్లు రామలింగయ్య, రమాప్రభ భర్తీచేశారు. ఒక టిపికల్ జమిందారీ పాత్రలో రావు గోపాలరావు కన్పిస్తారు. సత్యానంద్, ఆదినారాయణరావు, వి. యస్. ఆర్. కృష్ణారావు వరుసగా మాటలు, సంగీతం, ఛాయాగ్రహణం సమకూరుస్తున్న ఈ కుటుంబగాథా చిత్రానికి అంజలీదేవిగారి పతి (ఆదినారాయణరావు) నిర్మాత.



'పగడాల పడవ'లో హరనాథ్, విజయలలిత



ఈ మూడింటికి ప్రతినిధిగా, ఆ మూడింటి కోసం ఎలాంటి త్యాగాన్నయినా చేయడానికి వెనుకాడని ధీశాలిగా రెబల్‌స్టార్ కృష్ణంరాజుగారు నటించిన "అమరదీపం" సెప్టెంబర్‌లో లక్ష్మీద్వారా విడుదలౌతుంది. కృష్ణంరాజుగారి సమర్పణలో యు. వి. సూర్యనారాయణరాజుగారు నిర్మించిన ఈ వర్ణ చిత్రం రీ–రికార్డింగ్ ఆగష్టు మొదటి వారంలో పూర్తయింది. జంధ్యాల మాటలు, సత్యం సంగీతం, వి. యస్. ఆర్. స్వామి కెమెరా, భాస్కరరాజు కళ, రామచంద్రయ్య కూర్పు సమకూర్చిన ఈ చిత్రానికి హిట్ డైరెక్టర్ కె. రాఘవేంద్రరావు దర్శకత్వం పెద్ద అస్సెట్. గోపీకృష్ణ సంస్థ యింతవరకూ రెండు చక్కటి చిత్రాలను అందించింది. ఆ చిత్రాల స్థాయికి ఏమాత్రం తగ్గకుండా నిర్మింపబడింది "అమర దీపం". ఈ చిత్రానికి జయకృష్ణ నిర్వహణ.

## శోభన్‌కు లాల్ ప్రశంస

లక్ష్మి ఫిలింస్ కంబైన్స్ రంగుల్లో నిర్మిస్తున్న కరుణరసభరిత, కమనీయ చిత్రంలో శోభన్‌బాబుగారు రెండు పాత్రలను పోషిస్తున్నారని, ఎస్. డి. లాల్‌గారికి ఆయనతో యిది మొదటి చిత్రమని పాఠకులకు లోగడ తెలిపాను.

చిత్రం సగానికిపైగా పూర్తయింది గనక, తన అభిప్రాయాన్ని చెప్పవలసినదిగా, దర్శకుడు లాల్‌గారిని అడిగాను.

"శ్రీ శోభన్‌తో పని చెయ్యడం ఎంతో ఆనందంగా వుంది. తన పాత్ర పట్ల ఆయన ప్రదర్శిస్తున్న శ్రద్ధ... శ్రమ నన్ను ఆకర్షించాయి. నేను నూరు శాతం రిజల్టు చాలు అనుకున్నాను. 120 శాతం శోభన్‌బాబుగారు యిస్తున్నారు" అని లాల్‌గారు చెప్పారు.

నిర్మాత అనురాధాదేవి, శ్రీనివాసరావు... విజయకుమార్... కృష్ణవేణిగార్లు యిస్తున్న ఫెసిలిటీస్, సింప్లీ సుపర్బ్ అన్నారు దర్శకుడు లాల్.



'అమరదీపం'లో కృష్ణంరాజు, జయమాలిని

## అగరొత్తుల కోసం అప్పు చేసిన మురళీమోహన్

ఉద్యోగంలో అప్పుడే కొత్తగా చేరాడు మురళీమోహన్ (శివప్రసాద్). ఉండడానికి స్థలం దొరక్కపోయేసరికి తమ ఇంట్లోనే వుండమని ఇంటికి తీసుకొచ్చాడు ప్రభాకరరెడ్డి (జయసుధ తండ్రి). మురళీమోహన్ వాలకం జయసుధ (పార్వతి)కు నచ్చింది. అతనితో చనువుగా వుండడానికి ఆమె మనసు అంగీకరించింది. మురళి కూడా లోలోపల సుధ అంటే మక్కువ పెంచుకోసాగాడు. ఒకరోజు మురళి స్నానం చేసొచ్చి సుధను పిల్చాడు. ఏమీ అనుకోకపోతే నాల్గు అగరొత్తులుంటే యిస్తారా అని మోహమాట పడుతూ అడిగాడు. దేనికండీ! అని ప్రశ్నించింది సుధ.

పూజ చేసుకోడానికి. శనివారంపూట భోజనమైనా మానేస్తానుగానీ పూజ మానను. జీతం రాగానే అప్పు తీర్చేస్తాను అని ప్రాధేయపూర్వకంగా అడిగాడు. అతని మాటలకు జాలిపడి అగరొత్తులకి అప్పేమిటండీ! వుండండి యిస్తాను అని యింట్లోంచి అగరొత్తులు తెచ్చిస్తుంది.

పైనుదహరించిన అగరొత్తుల సంభాషణం గోపీకృష్ణా మూవీస్‌వారి "అమరదీపం" వర్ణచిత్రంలోనిది.

"బంధం, బంధుత్వం, బాధ్యత" –

'అర్ధాంగి'లో జయసుధ, అల్లురామలింగయ్య





తియ్యటి ప్రేమలేఖలు
బ్రతుకున వెన్నెలలు
నింపుతాయి....
విధి వక్రిస్తే
అవే చీకటిని చిమ్ముతాయి.





అన్నపూర్ణా వారి

# ప్రేమలేఖలు

సులోచనారాణి నవల

నిర్మాత
దుక్కిపాటి మధుసూదనరావు బి.ఎ.

దర్శకుడు
కె.రాఘవేంద్రరావు బి.ఎ.

సంగీతం సత్యం
కెమెరా విన్సెంట్
మాటలు సత్యానంద్

NVKR

నవయుగ

# సినిమా

## పేరు మారింది

ప్రపంచ ప్రఖ్యాత దర్శకుడు శ్యాంబెనగల్ దర్శకత్వంలో రవిరాజ్ ఇంటర్నేషనల్ నిర్మించిన సంచలనాత్మక చిత్రానికి ''అనసూయ'' అనే పేరు మార్చి, ''అనుగ్రహం'' అనే పేరు పెట్టినట్టు తెలుస్తోంది. విశాఖజిల్లాలోని అరిపాక, విజయ నగరం, పంచదార్ల, గంగవరం, భీమునిపట్నం మున్నగు పల్లెసీమ ప్రాంతాలలో, సహజ గృహ వాతావరణంలో మనోహరంగా చిత్రీకరింపబడిన ఈ ఈస్ట్మన్ కలర్ చిత్రంలో అగ్రనటి వాణిశ్రీ అతి ముఖ్య భూమికను పోషిస్తోంది

కె. వెంకట్రామిరెడ్డి నిర్మించిన ఈ ప్రయోగాత్మక చిత్రానికి ఆరుద్ర సంభాషణలు, గోవింద్‌నిహలానీ కెమెరా, వనరాజ్‌భాటియా సంగీతం, లతామంగేష్కర్, యస్ పి బాలసుబ్రమణ్యం గాత్రం సమకూర్చారు అనంతనాగ్, రావు గోపాలరావు, ప్రకాష్‌రాయలు, గరగ సూర్యనారాయణ, సిద్దేష్, ఎన్ సాంబశివ రావు, నాగరాజారావు, చెంచురామిరెడ్డి, రాజా నరసింహారావు, శేషంరాజు, వేణుగోపాల్, గవర్రాజు, డాక్టర్ ప్రభాకర్, జి. నిర్మల, రూప్సీ, స్మితాపాటిల్, సులభాదేశ్‌పాండే, జయవాణి, ఉమ మిగిలిన ముఖ్య భూమికలను ధరించారీ చిత్రంలో ఈ చిత్రం త్వరలో విడుదలౌతుందని వినికిడి

## మొరటోడు ముహూర్తం

సురేష్ ఎంటర్‌ప్రైజస్‌వారి ''మొరటోడు'' షూటింగ్ ముహూర్తం జూలై 30వ తేదీ నిర్ణయించబడి, సరిగ్గా వుదయం 8 32 కి శ్రీ సారథీ స్టుడియోస్‌లో ప్రారంభమైంది ప్రముఖ తమిళ హాస్యనటుడు నాగేష్ ప్రప్రథమంగా దర్శకత్వం వహిస్తున్న ఈ చిత్రంలో టైటిల్ పాత్రను గుణచిత్ర నటుడు సత్యనారాయణ పోషిస్తున్నారు జూలై 30న ప్రారంభమైన ఈ షెడ్యూల్ ఆగష్టు నెలాఖరు వరకు జరుగుతుంది సెప్టెంబర్, అక్టోబర్ మాసాల్లో అవుట్‌డోర్ వర్క్ ప్లాన్ చేసారు చిత్ర సమర్పకులు, స్టార్ ప్రొడ్యూసర్ డి. రామానాయుడుగారు ప్రభాకరరెడ్డి, అల్లురామలింగయ్య, రావు గోపాలరావు, జయసుధ, శుభ, బేబీరోహిణి తదితర పాత్రలను పోషిస్తున్న ఈ చిత్రానికి యం యస్ విశ్వనాధన్ సంగీతాన్ని, మోదుకూరి జాన్సన్ సంభాషణలను, వెంకట్ ఛాయాగ్రహణాన్ని, రాజేంద్రకుమార్ కళను, సమకూరుస్తున్నారు సురేష్‌బాబు నిర్మాతగా, వెంకటేశ్‌బాబు ఎగ్జిక్యూటివ్ నిర్మాతగా తయారయ్యే ఈ చిత్రంలో బోలెడంత వెరైటీని ఎదురు చూడొచ్చు మనము

## వాసిరెడ్డి కథకు దాసరి దర్శకుడు

పాఠకులను ఉత్సాహపరచే కథలను, ఉత్సుకత కలిగించే కథలను వ్రాయగల కొద్దిమంది ఉత్తమ రచయితల్లో వాసిరెడ్డి సీతాదేవి ఒకరు అందరు



'యమగోల'లో సత్యనారాయణ

వ్రాసే కథలు సినిమాకు పనికిరావు కొందరు వ్రాసేవి, చదువుకునేందుకుమాత్రమే గాక సినిమాగా చూడడానికికూడా పనికొస్తాయి

వాసిరెడ్డిగారి ''ఉరిత్రాడు'' నవలను, అగ్రదర్శకుడు . కుటుంబ కథల దర్శకుడు శ్రీ దాసరి చలనచిత్రంగా రూపొందించే బాధ్యతను స్వీకరించారు

రేడియో పబ్లిసిటీలో సిద్ధహస్తుడయిన విజయవాడ సాంబశివరావు నిర్మాణతలో ''ఉరిత్రాడు'' చిత్రం తయారు కాగలదని, శివలింగేశ్వరరావుగారు సమర్పించు ఆ చిత్రానికి, నాగేశ్వరరావుగారు నిర్మాత అని తెలిసింది

## దాసరికి మాదిరెడ్డి అభినందన

ఈమధ్య ఒకరోజున ప్రముఖ రచయిత్రి మాదిరెడ్డి సులోచనగారిని, వారి ఇంట కలిశాను ఎన్నో చిత్ర విచిత్ర విషయాలను చర్చించాము

ఆమె మనస్ఫూర్తిగా ఒక వ్యక్తిని అభినందించింది ఆయన ప్రజలెరిగిన ప్రజాదర్శకుడు దాసరిగారే

దాసరి దర్శకత్వంలో వచ్చిన ''ఓ మనిషి. తిరిగిచూడు'' చిత్రాన్ని ఆమె చూసిందట

''బెనగల్ మృణాల్''గార్ల వలె సెక్సును ఎక్స్‌ప్లాయిట్ చెయ్యక, సహజ సంఘటనలను ఎంతో హృద్యమంగా చిత్రీకరించిన దాసరి మేధాశక్తిని మాదిరెడ్డి మనసారా అభినందించింది

''దాసరి డిడ్ బెటర్ ద్యాన్ బెనగళ్ సేన్'' అని అనడానికి ఆవిడ సంశయించలేదంటే పాఠకులు నమ్మగలరా ?

—శ్రీనివాస్

దాసరి నారాయణరావు



యస్.వి.యస్. ఫిలిమ్స్

# జీవితమే ఒక నాటకం

నిర్మాత: యమ్.చంద్రకుమార్ సంగీతం: రమేష్ నాయుడు.

సహ నిర్మాతలు: యమ్.విజయకుమార్, యమ్.జీవన్‌కుమార్, యమ్.వెంకటరమణకుమార్

ఆంధ్ర: తారకరామ. రిలీజ్: నవభారత్ ఫిలిమ్స్, నైజాం: విజయ సురేష్ కంబైన్స్.

గడియో క్షణమో అని డాక్టరు చెప్పేవే దుర్గపిన్ని చెప్పిన మాటకి అందరూ ఒప్పుకున్నారు నిర్మలే కోలుకుంటుందనీ డాక్టర్ చెప్పివుంటే నిర్మలని సుమంగళిగా చెయ్యడానికి వాళ్ళు ఒప్పుకుంటారన్నది సందేహించవలసిన సంగతే

నిర్మలకన్న అధ్వాన్నపు స్థితిలో వుండి పంజరపు ఇనుపకమ్మీల వెనుక చిక్కుకొని బైటపడ్డానికి వెలుగురేఖలేని స్త్రీ జీవితాలెన్నో వున్నాయి కాని నిర్మల ధైర్యం, పట్టుదల వాళ్లకి మార్గదర్శకమైతే, నిర్మల పడ్డ కష్టాలూ, మానసిక వేదనా వృధాపోనట్టే.

శరీరంలోని ప్రాణం పోయేక ఆ శరీరం ఎవరికీ అక్కర్లేదు ఆ శరీరం మరి నిర్మలకాదు ఆ శరీరాన్ని పట్టుకొని ఏడ్చినంతసేపు ఏడ్చేం కాని ఆ శరీరం మరి నవ్వలేదు, మాట్లాడలేదు— కళ్లతోనన్నా కబుర్లాడలేదు ఆలస్యం అవుతున్నకొద్దీ "డీ కంపోజ్" అవుతుంది ఆ శరీరానికి నిప్పుపెట్టక తప్పదు — అది నిర్మల వదిలిన శరీరం — నిర్మలకాదు

ఆమె శరీరానికి దహనసంస్కారాలు జరిపేడు రామకృష్ణ — అతడు అక్కడే వుండిపోయేడు కాని మేం తిరిగి వచ్చీసేం మర్నాడు, దుఃఖపూరితమైన హృదయాలతో.

ఇంట్లో అడుగు పెడితే ఇల్లు బోసిగా కనిపించింది — మరి నిర్మల ఈ ఇంట అడుగు పెట్టదు కదా? ఎన్నో పుట్టుకలనీ చావులనీ చూసిందీ యిల్లు - వేదాంతం ఈ గోడలకి వంటపట్టి వుంటుంది కాని అవి నన్ను ఓదార్చలేక పోయేయి — యింటికి వచ్చేక ఏడుస్తూ కుప్పగా కూలపడ్డాను —

"అనసూయా! కష్టసుఖాలు శాశ్వతం కావు — ఈ దేహం అంతకన్న శాశ్వతం కాదు — ఎవరు పోయేరే? ఎవ్వరూ పోలేదు — నేను ఎప్పుడూ నీ దగ్గరే వున్నానే — నీ మనస్సులో వుంటానే, నువ్వు నీ దేహం వదిలాక ఎలానూ కలుసుకుంటాం కదా మనం?" అన్నట్టు వినిపించేవి నిర్మల మాటలు నా మనసుకి —

## ఒక కన్య చెప్పిన కథ

[23వ పేజీ తరువాయి]

వారం రోజులు తీవ్రమైన జ్వరం వచ్చింది నాకు. నిర్మల గురించే కలవరించేనుట —

"దీన్ని తీసుకవెళ్లకపోవల్సిందే — ప్రతిదానికీ తగుదునమ్మా అని బయల్దేరుతుంది — ఇదెంత? దీని వయసెంత?" అని నాన్నా అన్నా వదినని కోపంపడ్డారు — దుర్గపిన్ని నాకు అన్ని సేవలూ చేసింది — జ్వరం తగ్గేక యింట్లో యిటూ అటూ తిరుగుతూ నిర్మల కోసం వెతక నారంభించేను — నా పక్కనే వుండి నిర్మల మాట్లాడినట్టని పించింది

రామకృష్ణ పరిస్థితే విచారకరమైనది — నిర్మలకి మరి విచారంలేదు — అందరినీ వదిలి బంధాలు తెంచుక వెళ్లిపోయింది. కాని బతికివున్న వాళ్లం ఆమె స్మృతులు రేపే భావ సంచలనాన్ని, పొంగిపొరలే విచారాన్నీ తట్టుకోడం కష్టమయిన పని — రామకృష్ణ పరిస్థితి ఏమీ ప్రోత్సాహకరంగా లేదని విన్నాను — బ్యాంక్‌కి సెలవు పెట్టేడుట - అన్నింటిమీదా శ్రద్ధని వదులుకున్నాడు — నిర్మలని కాల్చినచోటికి వెళ్లి రోజూ కూర్చొనేవాడుట - ఆమెతో అక్కడ మాట్లాడేవాడుట — అతని తల్లిదండ్రులొచ్చి అతన్ని తోడ్కుక వెళ్లేరు తమతో —

రామకృష్ణ అలా బాధపడతాడని నిర్మలకి తెలుసు — తన (నిర్మల) చావు అతడికలా బాధ కలిగించకూడదనే నిర్మల ఆఖరి కోరిక — నా కళ్ల లోకి అందుకే జాలిగా చూసింది — కాని ఆమె మనస్సులోని కోరికేమిటి? అతడి దుఃఖాన్ని నేనెలా అంతం చెయ్యగలనని అనుకుంది? నాకు నిర్మల రూపు, నిర్మల ముఖం, నిర్మల మనస్సు లేనేలేవు — నేనూ నిర్మలా యిద్దరం విభిన్న వ్యక్తిత్వాల స్త్రీలం — నాలో వేలగుణం లేదు — అనౌసరంగా బెంగా, భయం పెట్టుకొనే లక్షణం తక్కువ పోయినవాటికోసం బతుకల్లా ఏడ్చే తత్వం తక్కువ - ప్రతి మనిషినీ విభిన్నంగా చూసి ఎంలైజ్ చేసే గుణం ఎక్కువ ఇవేవి నిర్మల గుణాలు కావు — అందుకే రామకృష్ణ ఆమెని మరిచిపోలేడు —

ఆ చిన్ననాడు ఒక రోజున ఆ జాంపండు తనకివ్వకపోతే నిర్మల వదిలిపెట్టలేదు — కేక వేసి ఆమె తల్లిని పిలిచింది పండు యిచ్చేవరకూ వదల్లేదు — పండు పుచ్చుకున్నాక ఆ పరిచయాన్ని మరిచిపోలేదు -- పరిచయాన్ని పెంచుకుంటూ వెళ్లింది —

కాని నా గుణం అందుకు భిన్నం — అతడు జాంపండు తెంచుకుంటే నేను అడగేఅడగను - అసూయపడే లక్షణం, ఒకరికున్నది కావాలనుకొనే లక్షణం నాకు తక్కువ

అందువల్లే నేను ఏవిధంగానూ రామకృష్ణ దుఃఖాన్ని తగ్గించగలనన్న నమ్మకం నిర్మలకున్నా, నాకుమాత్రం లేదు

* * *

ఒక విచారాన్ని పారద్రోలేది మరొక విచారమేనేమో అనిపిస్తుంది

విశాలకి నొప్పులు ఆరంభం అయ్యేయి ఒకరాత్రి తొలి కాన్పు అవడాన్ని చాలా బాధపడింది రాత్రల్లా నొప్పులు పడుతూనే వుంది

వదిన, దుర్గపిన్ని, పిల్లమ్మ, లక్ష్మమ్మ అక్కడే వుండి సహాయం చేసేరు

ఆరాత్రి కుమ్మరిదాసు ఎక్కడా కనిపించలేదు

తెలతెలవారుతూవుండగా పురుడు వచ్చింది మగపిల్లడు పుట్టేడు

కాని రక్తస్రావం ఆగలేదు డాక్టర్ శకుంతలని పిలుచుకొచ్చేడు అన్నయ్య. ఆమె తనకి చేతనయిన ప్రయత్నం చేసింది కాని వాతం శరీరంలో ప్రవేశించింది కాళ్ళా చేతులూ చలవలుకమ్మేయి రోజల్లా బతికి, సాయంత్రానికి దేవుడు దగ్గరికి వెళ్లిపోయింది విశాల

"హాస్పిటల్‌లో చేర్చవల్సిందండీ సిజేరియన్ చేసివుంటే బతికివుండేది" అంది డాక్టరు

ఒకప్పటికి తినడానికే తిండిగింజలులేని సంసారంలో పడిన విశాలని హాస్పిటల్‌లో చేర్పించే దెవరు? డబ్బు కట్టేదెవరు—ఒక రూపాయుంటే తాగి తందనాలాడే ఆ మొగుడా? కాటికి కాళ్ళు చాపుకున్న అత్తగారా? మాకుమాత్రం తెలుసా ఇంత ప్రమాదం జరుగుతుందని? తెలిసివుంటే ఎక్కడో డబ్బు అప్పుజేసి నర్సింగ్‌హోమ్‌లో చేర్చేవాళ్ళమే

భార్య పోయిందని తెలిసేక వచ్చేడు భర్త అందరూ తిట్టినతిట్లు ఒక లెక్కా అతనికి? మేమన్న మాటలే లక్ష్యపెట్టేవాడయితే భార్యని యిన్ని బాధలు పెట్టకేపోను ఆమె పురిటి సమయంలోనన్నా ఇంటిదగ్గరుండే బాధ్యత లేకపోయిందా మగాడికి?

స్త్రీ జీవితం ఇంత విలువలేనిదా? కట్టుకున్న భర్తకీ, కన్నతండ్రికీ లక్ష్యంలేక పోయింది మీదనున్న దేవుడికీ దయ లేకపోయింది

గాలిలో వచ్చింది ... గాలిలో పోయింది



[illegible] ఇటువంటి పరిస్థితి కల్పించి ఆడదాన్ని ఆమధ్యని ఎందుకు యిరికిస్తున్నావ్? యింత దయలేనివాడివా నువ్వు? ఆమె పడే ఆవేదనా, మానసిక సంక్షోభం, శారీరిక క్లేశం, పతనం చూసి ఆనందించడమేనా నీ లక్ష్యం?

ఏడ్చేను కాని నా కన్నీళ్లకి విలువేమిటి? ఆడదాని కన్నీటికున్న విలువేమిటి? కలకంఠికంట కన్నీరొలికిన సిరి ఇంటనుండ నొల్లదని ఎప్పుడో ఎవరో అన్నారు స్త్రీకి ఒక రికమండేషన్ ఉత్తరంలా. కాని ఆ ఉత్తరాన్ని ఎవరు చదువు తున్నారు? చదివినా ఎవరు ఖాతరు చేస్తున్నారు?

ఈ పంజరంలోంచి మరో పక్షి ఎగిరి పోయింది ఇంక మొగుడుచేత రోజూ దెబ్బలుతినే బాధ లేదు చీత్కారాలూ, అవమానాలూ భరించవలసిన అగత్యం అంతకన్నా లేదు

ఆ పుట్టిన పసిపాపని కనకదుర్గ తీసుకుంది పెంచుకుందుకి "ఈ పిల్లడిని యింక నీకివ్వను దాసూ! నేను పెంచి పెద్దచేసి విద్యాబుద్ధులు చెప్పించుకుంటాను" అంటూ తెచ్చేసుకుంది అందుకు సంతోషంగా ఒప్పుకున్నాడు దాసు —

చావులోంచి జీవం ఉద్భవిస్తుంది — ఒకటి చస్తేనేకాని మరొకటి పుట్టదు - బీజం చస్తే మొక్క పుడుతుంది మొక్క చచ్చి చెట్టు పుడుతుంది — పువ్వు చచ్చి కాయ పుడుతుంది — అలానే స్త్రీ తన శరీరంలోని కొంత భాగాన్ని చంపుకొని జీవిని లోకంలోకి తెస్తుంది — అప్పుడప్పుడు పూర్తిగా సమసిపోవచ్చును — బాల్యం చస్తేనేకాని యవ్వనం రాదు — యవ్వనం చస్తే మధ్యవయస్సు — అది చస్తే వృద్ధాప్యం — వృద్ధాప్యం చస్తేకాని దేహం అంతం అయి ఆత్మ బయటపడదు — కాబట్టి సృష్టిలో ప్రతి జీవీ ప్రతి క్షణమూ చస్తూనేవుంది ఆ చావులోంచి కొత్త రూపం పుడుతూనేవుంది —

అలానే విచారంలోంచి ఉద్భవించింది చంటి బిడ్డమీది మమకారం — ఈ శిశువుకి దూదెతో నోట్లో పాలు పొయ్యడం ఉదయమే స్నానం చేయించడం.. కావు... యివన్నీ నేనూ దుర్గపిన్నీ చూసుకొనేవాళ్లం. ఆ చంటివాడి ఆలనా పాలనా చూస్తూ మురిసిపోతుంది దుర్గమ్మ — వాడికో చిన్నమంచం చేయించింది—స్కూలు అవుతున్నంత కాలం ప్రతి అరగంటకీ లోపలికి వెళ్ళి చూసివస్తూ వుంటుంది

ఇది జీవితం — ప్రస్తుతం జరుగుతున్న ఆనంద విషాదాలలోపడి, పాత సంతోష విచారాలు మరిచిపోతాం — పాత మనసు చిగిర్చి కొత్తమనస్సు ప్రతి క్షణం పుడుతూనే వుంటుంది —

అందుకే నిర్మల చావునల్ల కలిగిన విషాదం, ఖేదంనించి రామకృష్ణ తేరుకుంటాడన్న నమ్మకం నాకుంది — అలా కోరుకోనప్పుడు మనిషి పిచ్చివాడి కోవలోకొస్తాడు — జీవితంలో, ఎప్పటికప్పుడు వచ్చే సమస్యలని ఎదుర్కోలేని మనిషి బతుకెలా ఈడ్చగలడు? ప్రతి అనుభవమూ మనసుని గట్టిపరచి ముందుకు తీసుకవెళ్లాలి అంతిమ యాత్ర వరకూ — ఆ శక్తిలేని మనిషి విరిగిపోయిన పంతెసలా, శిథిలమైన యింటిలా ఎందుకూ పనికి రాకుండా తయారవతాడు

కొన్ని నెలలు గడిచేయి — ఈ మధ్యని అలివేణికి కొడుకు పుట్టేడు — పురిటికి యిక్కడికే తెచ్చి నర్సింగ్‌హోమ్‌లో చేర్పించింది పిల్లమ్మ పిల్లడు పుట్టేక రెండు నెలలుంచుకొని రవీంద్ర తల్లిదండ్రుల యింటికి పంపేసింది — రవీంద్ర యిక్కడికి రాలేదు కాని తల్లిదండ్రుల యింటికి వచ్చి వుంటున్నాడుట — అలివేణిని ప్రేమగా చూస్తున్నాడుట — అతడిమీద వున్న సదభిప్రాయంలో అలివేణికి ఏ మార్పూ లేదు — అదే ప్రేమ అదే పిచ్చి. అలివేణి చురుకైన పిల్ల— గుండెధైర్యం కలది — ఎలాగో ఓలా వాళ్లని తనవేపు తిప్పుకుంటుంది — ఆ నమ్మకం నాకుంది

కూతురు వెళ్లిపోయేక పిల్లమ్మ యిల్లు వదిలి పెద్దకూతుర్నీ అల్లుడూ దగ్గరకి వెళ్లిపోయింది

సుగుణ కాలేజికి వెళ్ళివస్తోంది — ఆమె కొక ఆదర్శం, ఒక గమ్యం ఉన్నాయి — చదువుకొని, స్వతంత్రంగా ఒక జీవనోపాధి సంపాదించుకొని, కూతురు రాధని పెద్దచేసి, చదువు సంధ్యలు చెప్పించి, ప్రపంచాన్ని ధైర్యంగా ఎదుర్కొనేటట్టు చెయ్యడం. దేవుడు ఆమెమీద దయతలచి ఆమె నొక ఒడ్డుకు చేరుస్తాడని నా ఆశ అందుకని నేను దేవుణ్ణి ఎప్పుడూ ప్రార్థిస్తూవుంటాను సుగుణవంటి ధైర్య స్థైర్యాలున్న ఆడవాళ్లు

**రాగబంధం**
**23-9-'77 నుంచి**
**ప్రారంభం!**

అరుదు వారి కృషికి తోడుగా వారికి కావలసింది దేవుడి కరుణావృష్టి ఒక్కపిసరు, తోటివాళ్ళ సానుభూతి మిగిలినది అదృష్టంమీదకన్న స్వశక్తిమీద వారికి నమ్మకం ఎక్కువ

## 23

"ఇంకేముందీ చెప్పడానికి? నే ఉంటున్న పంజరంలాటి ఇంటి గురించీ, అందులో నా చుట్టూ వున్న వాలాటి నాకు తెలిసిన పక్షుల గురించీ చెప్పేనుకదా?" అనసూయ నాకేసి ప్రశ్నార్థకంగా చూసింది

"మరి నీ గురించేమిటి అనసూయా? నీ భావి గురించే మాలోచించేవ్? యీ పంజరంలోంచి బయటపడాలని వుండదా?" అని అడిగేను

"నా గురించే నేను ఆలోచిస్తే తక్కినవాళ్ల గురించి ఆలోచించేదెవరు? స్వార్థగుణం నాలో లేదని అనను. స్వార్థం మనిషిని ముందుకు నడుపుతుంది కాని ఎదుటివాడికి కొంత సాయపడాలని నా భావన అతడి మంచి గురించి కొంతయినా ఆలోచిస్తే నా మంచికూడా జరుగు తుందన్న నమ్మకం నాది. దున్నేవాడు తనకోసమే పండించుకుంటే, నేసేవాడు తనకోసమే నేసుకుంటే ఈ సమాజం బతుకుతుందా? వాళ్లు మన గురించీ, మనం వాళ్ళ గురించీ ఆలోచించి మంచిని ఒకరికొకరు చేసుకుంటూ వెళ్లాలికదా?" అనసూయ సిన్సియర్‌గా అంది

"రామకృష్ణ మాటేమిటి? అతడ్ని నిర్మల నీ కప్పగించిందికదా? ఒకవేళ రామకృష్ణ వస్తే నీ జీవితంలోకి రానిస్తావా?" చిరునవ్వుతో అడిగేను

అనసూయ సిగ్గుపడింది తల వంచుకొని, కాలి వ్రేళ్లకేసి చూస్తూ చెప్పింది. "నిర్మలని అంత వేగం మరిచిపోలేడు రామకృష్ణ ఆమె జ్ఞాపకాలు అతన్ని వదలవు!"

"ఒకవేళ వస్తే అతను?"

"ఇంత వేగం రాడు. పగటికలలుకనే స్వభావం నాకు లేదు, రేపేదేనా సంబంధం నాన్న తెస్తే, అతడికి నేను నచ్చితే పెళ్లి అయిపోతుంది వెళ్లిపోతాను రామకృష్ణ వస్తాడేమో అని ఆగిపోలేనుకదా? నాన్న మనసుకి శాంతి నివ్వవలసిన బాధ్యత నా మీదుందంటారా లేదంటారా?"

"ఈమధ్యన రామకృష్ణ వస్తే?"

"వస్తే చూదాం—అప్పటి సంగతి అప్పుడు జీవితంలో పగటికలలకి తావులేదు"

"ఇంకేమన్నా చెప్తావా?"

"మరేముంది చెప్పడానికి? ప్రస్తుతానికిలా గడిచిపోతోంది గాలిలోని రెమ్మలా కొట్టుకొచ్చేను లోకంలోకి మరో గాలేస్తే కొట్టుకపోతాను అంతవరకూ వుండక తప్పుతుందా? ఈ పంజరం వదులితే మరో పంజరం — ఏదో ఓ పంజరంలో ఆడదుండక తప్పదుకదా? కాదంటారా చెప్పండి?"

"దానికి జవాబు, నువ్వు చెప్పిన కథ అచ్చయితే ఆ కథ చదివిన పాఠకులకే వదుల్తాను— నే చెప్పలేను సమాధానం" నవ్వుతూ అన్నాను

"ఏముందండీ నా కథలో—? ఎవరు వింటారు? ఎవరు చదువుతారు?" సినికల్‌గా పెదవి విరిచింది అనసూయ — "నా గురించి వదలండి కాని... సుగుణ గురించీ, నిర్మల గురించీ, రంగారావులాటి వంచకుల గురించీ, దుర్గపిన్నివంటి మణిపూసల గురించీ అందరూ తెలుసుకోవాలని నాకుందండీ! అందుకే ఈ సంగతులన్నీ మీకు చెప్పేను వాళ్లగురించి ఎక్కువగా రాయండి. నా గురించి తగ్గించండి. అప్పుడు ఏ పత్రికన్నా అచ్చు వెయ్యొచ్చు" ఎటో దూరంగా చూస్తూ అంది

ఈశ్వరుడి కోవెల ప్రాంగణంలో కూర్చున్నాం — సంధ్యా సమయం — జే గంటలు వినిపిస్తున్నాయి నేనూ ఏవో ఆలోచనలలో పడిపోయేను.

"నమస్కారం! నాకింక శెలవిప్పించండి — రాస్తే, అది ఎవరన్నా వేస్తామంటే నాకు తెలియ జెయ్యండి. ఎవరినన్నా అడిగి ఆ పత్రిక చదువుతాను."

ఉలిక్కిపడ్డాను.. ఆలోచనలలోనించి అనసూయ లేచి నిల్చుంది —

"అప్పుడప్పుడు కనిపిస్తూవుండు..."

"ఆలయానికి వస్తూవుంటానుగా ప్రతి వారం.. వస్తా బాబాయ్‌గారూ!" నా పాదాలకి మొక్కింది.. ఎప్పుడూ లేనిది..

# ఒక కన్య చెప్పిన కథ

నా కళ్లలో నీళ్లు తిరిగేయి — అ.సూయకి లు చెయ్యమని దేవుణ్ణి ప్రార్థించేను కళ్లు గాసుకొని — కళ్లు విప్పేసరికి వెళ్లిపోతూ సూయ కనిపించింది — ఆమె కూడా కళ్లు క్తుకుంటోంది —

*　　　*　　　*

నాకా ఊరునించి బదిలీ అయిపోయింది గార ప్రాంతానికి — మరి అనసూయని చూడడం లేదు ఆ ఊరు వెళ్లే అవసరమూ కలగలేదు— లుగేళ్లు గడిచిపోయేయి

తిరుపతి వెళ్లేను — తిరిగి వస్తున్నప్పుడు ద్రాస్‌లో వున్న పిన్నిని చూసి రెండ్రోజులుండి రా మెయిలెక్కేను విజయవాడ చేరుకొనేసరికి మయం ఆరయింది — అక్కడ అరగంటే వుండ ర్సింది కనీసం పలభై అయిదు నిముషాలన్నా గంది దానికి తోవదు — డ్రయివర్లూ, గార్డూ క్కడా పత్తా వుండరు —

ప్లాట్‌ఫారంమీద యిటూ అటూ తిరిగేను. ఫీ తాగేను — నెస్కెఫీ దండీగా వేసి యిచ్చేడు — ండు కప్పు లెక్కించేను — యింకా చాలా యిముంది —

అటు ప్లాట్‌ఫారం మీదున్న గోల్కొండా క్స్‌ప్రెస్ ఐదు నిముషాల్లో బయల్దేరుతుందని నౌన్స్‌మెంట్ విని ఊసుపోక గేట్ దాటి అటున్న ప్లాట్‌ఫారం మీదికి వెళ్లేను రెయిళ్లు చూడడం కిష్టం ఎంతో జీవితం కనిపిస్తుంది — ఎన్నో థలు మనసుకి తడతాయి రైలుని చూడాలంటే, ంజన్‌తో ఆరంభించి గార్డు పెట్టె వరకూ పెట్టె పెట్టే చూసుకుంటూ వెళ్లాలి

అలా చూసుకుంటూ సగం దూరం ళ్లేసరికి "బాబాయ్‌గారూ!" అన్న సుపరిచిత ంఠం వినిపించింది అనసూయ! ఎక్కడ్నించి ఊడిపడింది?

"ఇక్కడా! యిలా రండి బాబాయ్!" క్కిరిబిక్కిరయి పిలుస్తోంది.

ఆనందంతో పరుగులుతీసేను — కిటికీ దగ్గరి టు

"అనసూయా! నువ్వా! ఆఫ్ ఆల్ ది ప్లేసెస్ ఇక్కడ నిన్ను చూస్తాననుకోలేదు! ఎక్కడున్నావ్? ఎలా వున్నావ్? ఎక్కడికి వెళ్తున్నావ్ ఒంటిగా? నీ ఒడిలో యీ ముద్దులపాప యెవరిది?" గబగబా ప్రశ్నలవర్షం కురిపించేను ఆమె అందించిన చెయ్యి అందుకొని పాప నన్ను చూసి నవ్వుతోంది

అనసూయ కళ్లు ఆనందంతో అంతంతలయి వెలగిపోతున్నాయి..

"నన్ను క్షమించాలి బాబాయ్! మీ అడ్రస్ తెలీక శుభలేఖ పంపలేకపోయేను.. ఎంత బాధపడ్డానని!"

"వ్వాట్! నీ పెళ్లి అయిపోయిందా?" ఓ అర్థంలేని ప్రశ్న వేసేను

"అవకపోతే ఒడిలోకి పాప ఎలా వస్తుంది సార్! తమరు పరాకు చిత్తగిస్తున్నారు!" కొంటెగా చూస్తూ నవ్వింది అనసూయ.

"అవునవును ... ఐ ఎపోలొ గైజ్ ...! ఎప్పుడయింది నీ పెళ్లి..? నీ శ్రీవారేరీ? పేరేమిటి? ఊరేమిటి?"

"నిరుడే అయింది లక్కీ...మరే సంబంధం ఈమధ్య రాకపోవడం ... రామకృష్ణ అల్టిమేట్‌గా రావడం.." సిగ్గుపడింది అనసూయ

"రామకృష్ణ! కంగ్రేట్స్ అనూ! సాధించేవ్..."

"నో సార్! ఐ ఏమ్ సారీ ఫర్ నిర్మలా! అదే బతికుంటే ఎంత బాగున్ను!"

"నువ్వెప్పుడూ నీగురించి ఆలోచించుకోలేవ్ లనూ! నిర్మలని గుర్తుమాత్రం చెయ్యక నిర్మలని మరిపించు ... విన్నావా?"

"నెవ్వర్! అలా నిర్మలని మరిచిపోనండోయి! మేం నిర్మల గురించి మాట్లాడని రోజెక్కడ? అందుకే అతనికి నే అంటే యిష్టం."

ఇదెక్కడి మనిషి!

గార్డు విజిలిచ్చేడు

"నీ అడ్రసియ్యి... నా అడ్రసిస్తాను..." తొందరగా నోట్‌బుక్ తీసేను.

"హైదరాబాద్‌లో వుంటున్నాం.. మలక్‌పేట" గోలలో వినిపించలేదు రైలు కూతపెట్టి కదిలింది అడ్రస్ తీసుకోడం, యివ్వడం అవలేదు

"నవల ఎంతవరకూ వచ్చింది?"

"నీ సంగతేమయిందో తెలీక పూర్తి చెయ్యలేదు వెళ్లగానే పూర్తి చేస్తా" రైలుతోపాటు నడుస్తూ చెప్పేను

"ఐ ఏమ్ సో హేపీ బాబాయ్! మీరు కనిపించేరు. మీ అడ్రస్ ఇవ్వండి!"

బాబుని ముద్దాడేను గాజుల సందుల నించే..

"నీ కథ అచ్చయినప్పుడు ... పత్రికవాళ్లకి రాస్తే నా అడ్రసిస్తారు ... రైలెళ్లిపోతోంది. రాసివ్వడానికి టయిమ్ లేదు. హైదరాబాద్ వచ్చినప్పుడు మీ యింటికొస్తాలే. మలక్‌పేట కదూ? అక్కడే అడుగుతాను .. రామకృష్ణ ఇల్లెక్కడంటే ఎవరన్నా చెప్తారుకదూ?" సమయంలేక అడ్రసివ్వలేక అన్నాను

అనసూయ కన్నీళ్లు కారుస్తోంది. "మరిచిపోకండి నన్ను బాబాయ్!"

నాకూ కన్నీళ్లాగలేదు .. "నెవ్వర్! నెవ్వర్ షెల్ ఐ ఫర్గెట్ యూ!"

రైలు దూరమయింది వెళ్లిపోయింది

అనసూయని మరి చూడడం అవుతుందో లేదో నాకు తెలీదు ఎప్పుడో ఓనాడు ఈ కథ అచ్చయితే అనసూయే నా అడ్రస్ కనుక్కొని నాకు రాస్తుందన్న నమ్మకం వుంది

అచ్చవకపోతే?

ఐ డోన్ట్ కేర్!! ఎందుకంటే.

అనసూయ గురించి మరి నాకు చింతలేదు ధైర్యమయినపిల్ల అనసూయ. అదృష్టం ధైర్యవంతుల్నే వరిస్తుందన్న సామెతలో కొంత నిజం లేకపోలేదు

*[అయిపోయింది]* ●

---

చ్చి, నిర్మాతతో పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ కూర్చుండిపోయాను

కాస్సేపయ్యాక ఆ హీరోయిన్ త న దగ్గరికి వచ్చి, నా చేతులు పట్టుకొని, "మీ ప్పనుకోండి మా చర్మంతో చెప్పులు కుట్టించినా మీ ఋణం తీర్చుకోలేము ఎంత చక్కని లహా యిచ్చారండి! ఆ డైరెక్టర్‌తో అలాగే చెప్పాం — పాపం, నమ్మేశాడండి" అంది నందంతో ఉక్కిరిబిక్కిరి అయిపోతూ

ఆ తర్వాత వారం రోజులకు 'సఫైర్' థియేటర్‌లో 'క్లియోపాత్ర' సినిమా చూడ్డానికి వెళ్లాను. నేను మెట్లు ఎక్కబోతూంటే, కొత్త హీరోయినూ, ఆ డైరెక్టరూ మెట్లే

## జి. వి. జి. పేజీ

[25 వ పేజీ తరువాయి]

చూసి బయటకు వస్తున్నవారల్లా నాకు ఎదురు పడ్డారు. డైరెక్టర్ నవ్వుతూ నా దగ్గరికి వచ్చి నా భుజం తట్టుతూ, "ఏమిటి భాయ్! ఈమధ్య వ్రతాలు, గీతాలు అంటూ భలే సలహాలిస్తున్నావట కదా? నాకంతా తెలుసులే?" అంటూ ఆ హీరోయిన్ వంక క్రీగంట చూశాడు

నేను అమాంతంగా కొయ్యబారిపోయాను.

"నీ సలహాను మా పిక్చర్ క్లయిమాక్స్ సీన్‌లో ఉపయోగించుకుంటున్నాంలే! విలన్‌బారి నుంచి తప్పించుకోడానికి ఈ హీరోయిన్ తనకు మూడు మాసాలపాటు ఏదో వ్రతముందని చెబుతుంది దాంతో కథ అమోఘమైన మలుపు తిరుగుతుంది నీ ఐడియాకు థాంక్స్ చెప్పాలిగా?" అన్నాడా డైరెక్టర్ నవ్వుతూ

ఆ తర్వాత వాళ్లిద్దరూ చెట్టాపట్టా లేసుకొని, ముసిముసిగా నవ్వుకుంటూ తమ దారిన తాము వెళ్లిపోయారు

ఆ హీరోయిన్‌కు ఆ తర్వాత మరే పిక్చర్‌లోనూ ఛాన్స్ వచ్చినట్లులేదు కొంతకాలమయ్యాక తన స్వగ్రామానికి వెళ్లిపోయింది

ఆ డైరెక్టరూ ఏదో వూళ్లో ఏ చిట్‌ఫండ్ కంపెనీలోనో ఉద్యోగం దొరికితే వెళ్లిపోయాడట

చెప్పొచ్చేదేమిటంటే — ఆ తర్వాత నను ఏ హీరోయినూ సలహా అడగలేదు, నేనూ ఏ సలహా ఇవ్వలేదు!

# నెల నెలా మీ బైసికిల్ రిపేర్ చేసుకోకుండావుండాలంటే...



# హెర్క్యులిస్ కొనండి

హెర్క్యులిస్‌కి రిపేరీల అవసరం చాలా తక్కువని రుజువైనవిషయము.* కాబట్టి అనవసరంగా ఊరికే తంటాలు పడకుండా రిపేరీలమీద ఖర్చులు ఆదాచేయండి.

మీరు వెచ్చించిన సొమ్ముకి హెర్క్యులిస్ ఎన్నో విధాల అధిక విలువను ఇస్తుంది. తొక్కడం చాలా సులభము. ఎంతో సుఖదాయకము. నిరాయాసకరము.* ఇతర బైసికిళ్ల కంటె ఇది ఎక్కువగా మన్నుతుంది.*

హెర్క్యులిస్ స్వంతదారులను ఎవ్వరినైనాసరే అడగండి.




**వెల. రూ. 346**
(స్థానిక పన్నులు, సీటు ఇతర సరంజాములు అదనము.)

* ఆధారము: ఇండియన్ మార్కెట్ రీసెర్చి బ్యూరో వారి పరిశీలనా ఫలితము.







టీఐ సైకిల్స్ ఆఫ్ ఇండియా,
మద్రాసు-600 053

**హెర్క్యులిస్**

# లోకం తీరు




కె. జనార్దనశర్మ

ఆ వూరు పూర్వజన్మ సుకృతం అటువం టిది మరి !

పల్లెటూరు 'పల్లెలా' వుంటేనే అందం. కాదనలేము. కానీ కనీస సౌకర్యాలు వుంటేనే కదా ఏ వూరికయినా ఎవ్వంత సౌకర్యంగా వుంటది. ఆ కనీస సౌకర్యాలు ఆ వూరికి వున్నా అని ఆలోచిస్తే జవాబు జావగారి పోతుంది ఏవీ ? ఎక్కడ అని దిక్కులు చూస్తుంది . .

వో కుంభవృష్టి కురిసిందనుకోండి. ఆ వూరు ద్వీపమయి పోతుంది. చుట్టూ జలం అష్ట దిగ్బంధం చేసి మీసం మెలి వేస్తుంది. ఆ అష్ట దిగ్బంధనాన్ని చీల్చు కుని, వూరి వారిని, వారి వారి అవసరాలను, వూరినుండి బయటకు తీసుకుని పోవటానికి మార్గంలేదా అంటే . . లేకపోలేదు వుంది అది ఏ స్థితిలో వుందీ ... అని అడగండి మరి

మీ రెప్పుడైనా సతీ సావిత్రి నాటకం (సినిమా) చూశారా ?

'నా వెంట రావద్దు తల్లీ !' అని మొర పెట్టుకుంటున్నా వినక వెంబడిస్తున్న సత్య వంత పత్నిని భయపెట్టటానికి యమధర్మ రాజు యమలోకానికి పోయే మార్గాన్ని కళ్లకు కట్టినట్టు వర్ణిస్తాడు విన్నారా ?.

అలనాడు సావిత్రికి వచ్చిన అవసరాన్ని కలదన్నే అవసరం వచ్చినవాళ్ళు, సావిత్రిని మించిన మొండి ధైర్యమూ, పట్టుదలా, సాహసమూ కలవారూ మాత్రమే — రోడ్డు అనబడే ఆ మట్టి రోడ్డు మీద — వానాకాల సమయంలో నడవటానికి సాహసించగలరు

"కాలువేసిన చాలు జర్రున నిలు జారి
పరువు తీయునట్టి 'జారు' రోడ్డు
(తారు రోడ్డు కాదు)
పాద మూనిన చాలు పదియంగుళముల లోతు
కాలు మ్రింగివేయు బురద రోడ్డు,
తిక్కరేగింపంగ నిను క్రింద పడదోసి
బురద పులిమి చూచు చిలిపిరోడ్డు ...
. .ఇలా వర్ణించుకోవచ్చు తనివి తీరా —

కాలు కదిపి బయట వూరికి కదలటా నికి కూడా సౌకర్యం లేని ఆ వూరికి మెచ్చుదగు వస్తువ ఒక్క సౌకర్యం మాత్రం వుంది. అదే తపాలు సౌకర్యం

తపా లంటేనే తపారాముడు ఠక్కున కళ్లముందు మెదులుతాడు ఆ వూరి ప్రజలకు

వూరి వారందరికీ—మంచివో చెడ్డవో — సంబంధించిన వార్తలు తెచ్చే తపారాముడు మాత్రం పడుతూ లేస్తూ, లేస్తూ పడుతూ రానూపోనూ రోజూ పద్నాలుగు మైళ్ల దూరం నడుస్తాడు అతని సర్వీసులో సగభాగం ఆ నడకకే సరిపోయి వుంటుంది ఆ వుద్యోగంలో చేరిన దగ్గర నుంచీ

మోస్తున్న సంచి బరువు లేకపోయినా చేస్తున్న ఉద్యోగం మాత్రం చాలా బరువుగా లేదు తపారాముడికి

కానీ ఏం చేస్తాడు అలాగే రోజులు తోసుకుంటూ వస్తున్నారు. ।

పొద్దు బారెడు సాగిన నీడలు చెట్లిడు పొట్టివై పోతుండగా టపాసంచి పట్టుకుని బయలుదేరి, ఏడుమైళ్ళ దూరం నడిచి, ఆ సంచి బస్తీలో తపాలాఫీసులో పడవేసి,

... ... ... ... వు ... ... ..., మళ్ళీ మరో సంచి పట్టుకుని బయలుదేరి. పెత్తేటు నీడలు బారెడైపోతున్న సమయానికి గూటికి చేరేవాడు.

ఆదివారం తప్ప అన్ని రోజుల్లోనూ ఇదే అతగాడి ఉద్యోగం.

అప్పుడప్పుడూ అదనపు— అనధికార— బాధ్యతలు కూడా వడుతూనే వుండేవనుకోండి. అంటే వూళ్ళోనాళ్ళకు బస్తీలో ఏమైనా చిన్నా పెద్దా పనులున్నా, ఈవూరివారికి ఆవూరిలోనూ, ఆవూరివారికి ఈవూరిలోనూ బంధువులున్నా వాళ్ళందరికీ రాముడు రవాణా ఏజంటన్నమాట.

సరే—

ఇలాగే తన ఉద్యోగ ధర్మాలు కొనసాగిస్తున్న రాముడు వో శుభముహూర్తాన— రొప్పుకుంటూ రొజుకుంటూ టపాసంచీ మోసుకుని వస్తూ రచ్చబండ దగ్గిర రాజ్యాల నేలుతున్న పెద్దమనుషుల కంట పడ్డాడు. పడి వెళ్ళిపోయాడు... తను 'పడిన' సంగతైనా తెలుసుకోకుండా.

అలా అతడు వెళ్ళిపోయిన తర్వాత రచ్చబండ దగ్గిర చర్చ రాముడిమీదకే మళ్ళింది. "ఎట్టాగయినా రాముడు మంచి ముండాకొడుకులే" అన్నాడు వెంకట సుబ్బయ్య చర్చను ప్రారంభిస్తూ.

అవునవునని ఏకగ్రీవంగా ఆమోదించారు అందరూ. వాళ్ళందరికీ పెట్టుబడిదారు వెంకట సుబ్బయ్య.

అక్కడ ఆ సమయంలో వెంకట సుబ్బయ్య రాముడి ప్రసక్తి ఎత్తటంలో ఓ చిన్న కిటుకు వుంది. ఆ కిటుకుని కార్యరూపంలో వుంచటం ఎలాగా అన్నది అతడు ఆలోచిస్తూండగా—వెదకబోయిన తీగ కాలికి తగిలినట్లు—చక్కని ప్రశ్న ఒకటి వేశాడు ఒక సభ్యుడు.

"ఇంతకీ ఆడి జీతం ఎంతుంటుందంటావే సుబ్బయ్యన్నా" అని.

ఆ ప్రశ్నను చక్కగా తనకు వీలుగా వాడుకున్నాడు వెంకట సుబ్బయ్య, "జీతంమాట ఎట్టావున్నా...ఆడి జీవితంలో సగం ఈ సంచి బుచ్చుకుని తిరగటానికే సరిపోద్దిలా వుంది" అంటూ.

అప్పుడు ప్రారంభమయింది అసలు చర్చ.

"అవునే పాపం! అసలె ఒంటూపిరోడు. ఆ ఒంట్లో ఊగాడగలబడ సమునాట్టవుంటె చూట్టానికే జాలేస్తాది" అన్నాడొక సభ్యుడు.

"ఊరూరు తినే తిండి ఒక్కసారి తిరిగే సరికే అరిగి పోద్దేమో పాపం. కాళ్ళు కొయ్యలయి పోవేంటి. ఎట్టయినా ఎదవ నవుకరీలెద్దూ" సానుభూతి చూపించాడు మరొకాయన.

బాధితుల పట్ల సానుభూతి చూపించే వాళ్ళు అధికులే... ఆదుకునేవాళ్ళు కూడా వుంటారనుకోండి. ఎలాగైనా సహాయకారులకంటే సానుభూతిపరులే అధికంగా వుంటారేమో!

అందర్లూ శాయశక్తులా సానుభూతి చూపించేశారు.

అందరినీ సానుభూతి చూపించనిచ్చి ఆఖరున అన్నాడు వెంకట సుబ్బయ్య.

"ఒక్కోడు ఆడిమీద యింతింత జాలి చూపించే బదులు వొక్కపని చెయ్యరాదేంటేహే" అని.

"ఏంటేంటీ" అన్నారంతా.

"ఆడు పాపం! ఆ సంచీ బుచ్చుకుని రోజుకి పద్దాలుగుమైళ్ళు తిరగలేడనేగా మీ గోల"

"అవు నవును" అన్నారంతా.

"పోనీ సుబ్బరంగా తలా నాలుగూ యేసుకుని ఆడికో సెకండాంటు సైకిలొకటి కొనిపెట్టరాదంటేరా..."

అందరికీ పచ్చివెలక్కాయ అటుక్కున గొంతులో పడింది. వెంకటసుబ్బయ్య ఇంకా కొన సాగిస్తూనే వున్నాడు.

"ఆడందరికీ ఉపయోగపడ్తన్నాడుగందా అందరికీ ఉత్తరాలెచ్చి పంచిపెడ్తన్నాడు. పైపెచ్చు చిన్న చితకం పనులన్నీ చేసిపెడ్తన్నాడు గందా బస్తీ కెళ్ళినపుడు."

"అవుననుకో" అంటూ నసిగాడో సభ్యుడు.

"ఇంక అనుకోమేంటి. అనుకో ఇనుకో. ఆడిమీద యిప్పటిదాకా అంత జాలిపడిపోయారుగందా ఒక్కోళ్ళూ. తలో నాలుగు యేసుకుని ఆడికో సైకిలు కొనిపెట్టలేరేంటిరా" రెట్టించాడు వెంకట సుబ్బయ్య.

"భలేమాటేశే సుబ్బయ్యన్నా! యింత తింటంలేదూ. ఆడికిచ్చే నాలుగు రూపాయలూ బరువైపోతయ్యేంటి మాకూ అట్టాగే యిద్దాంలేకానీ... గిల్లమాటెహే... నీ కిష్టంలేపోతే యిచ్చుకుంటాంగానీ...సరి యిప్పటికిప్పుడు సెకండేంగు సైకిలు యెక్కడ దొరుకుద్దేటే..."

తను కదిపిన కొన, చక్కా కదిలి, మళ్ళీ తనకు కావలసిన కొన తన చేతికి వచ్చినందుకు—తన కార్య నిర్వహణా చాతుర్యానికి గర్వంగా, గుంభనగా నవ్వుకున్నాడు వెంకట సుబ్బయ్య. ఆనక—

"భలేవోడివిరా దుర్గయ్య! మునపందరం పూనుకొని వొక పన్జెయ్యాలీ అనుకుంటే యిట్టాటి చిన్నచిన్నవి కంటికి కనపడకుండా పోతయ్యేంట్రా..."

అసలు సంగతి ఏమంటే— ఒకప్పుడు మోజుబడి కొనుక్కుని ఇప్పుడు మోజు తీరిపోగా మూలకి చేరి బూజుపట్టి పోతున్న సైకిలొకటి వెంకట సుబ్బయ్యదగ్గిరవుంది. పర్లేదు. బానే వుంటుంది సైకిలు. తను రౌతుకి సేవచేయగల స్థితిలోనే వుంది. కాని వెంకట సుబ్బయ్యకే ఇప్పుడు దానిమీద మోజులేదు. ఎప్పుడు అమ్మేసి సొమ్ము చేసుకుందామా అని చూస్తున్నాడు. ఇన్నాళ్ళకి అతని బుర్ర చాకులా పని చెయ్యటంవలన అవకాశం తన్నుకుంటూ వచ్చింది.

"...మాటవరసకి నా సైకిలే తీసుకో.



# వారఫలం

మహేష్

9-9-1977 శుక్రవారం మొదలు
15-9-1977 గురువారం వరకు

మేషం.— మీ మంచితనమే మీకు ఇబ్బంది కలిగిస్తుంది. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణించగలదు రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. దైవ కార్యాలు నెరవేరతాయి.

వృషభం— వృత్తిలో పోటీవారిపోటీ తగ్గుతుంది మిత్రులకు సహాయం చేస్తారు స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలు వాయిదా పడతాయి [redacted] మున్ముందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధిస్తారు స్త్రీలకు—వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు పోటీవారిలో గౌరవం లభించగలదు.

మిథునం — మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది రావలసిన డబ్బు అందుతుంది వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన సమాచారం అందగలదు.

కర్కాటకం — మీ కార్యక్రమాలు బాగుంటాయి. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. ప్రయోజనంగల పరిచయాలు ఏర్పడతాయి మీ ఆలోచనలు ఫలిస్తాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి స్త్రీలకు కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. బంధుమిత్రులను కలుసుకొంటారు.

సింహం — మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది వారం మధ్యలో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. పోటీవారిలో గౌరవం లభించగలదు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది

కన్య— వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది మిత్రుల సహాయం లభిస్తుంది వారం మధ్యలో అధిక వ్యయం జరుగుతుంది ప్రయోజనంలేని శ్రమ కలుగుతుంది వారం ఆఖరులో మీ కార్యక్రమాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది సంతానానికి సఖ్య సంతోషాలు లభిస్తాయి.

తుల - వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది బంధువులకు సహాయం చేయగలరు

వృశ్చికం — రావలసిన డబ్బు అందగలదు నూతన వ్యవహారాలు లాభిస్తాయి ప్రయోజనంగల పరిచయాలు ఏర్పడతాయి. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి మీరు ఇదివరకు — చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి స్త్రీలకు సంతోషకరమైన వార్తలను వింటారు పుణ్యకార్యాలు చేస్తారు.

ధనుస్సు— చికాకులు ఏర్పడతాయి సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది వారం మధ్యలో అనుకూలమైన మార్పులు వస్తాయి. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. సాహిత్య కళా రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

మకరం — భాగస్వాములతో కలిసిచేసే వ్యాపారాలు బాగుంటాయి. మీ ఆలోచనలు ఫలిస్తాయి. వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి స్త్రీలకు—[redacted]కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి బంధువులకు చికాకులు ఏర్పడతాయి.

కుంభం — అనవసరమైన సందేహాలు కలుగుతాయి పోటీవారితో వాద ప్రతివాదాలు తగవు ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వారం ఆఖరులో మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. స్త్రీలకు ఆరోగ్యం బాగుంటుంది ఆడంబరం కోసం వ్యయం జరుగుతుంది

మీనం— మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది వృత్తిలో పోటీవారిపోటీ పెరుగుతుంది ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి విలాస వస్తువులు కొంటారు.

---

అది సెకండుహేండుదన్న మాటేగానీ ఫస్టాండు సైకిలు బాబుగాడిలా వుంది. అసలా సైకిల్ని అమ్మాలని లేదనుకో నాకు. కానీ మనవో మంచిపని చెయ్యదల్చుకున్నపుడు ఇట్టాంటి చిన్నచిన్న నష్టాలు భరించాలి మరి దాన్దేముందిలేగానీ... ఇదిగో అబ్బాయ్ మీరంతా రాములుగాడికి వో సైకిలంట్టూ కొనిపెట్టాన్కి సిద్ధపడతన్నారు కామట్టి నేన్జెయ్యగల సాయం నేన్జేస్తానినంది. ఆ సైకిలు యెట్టా లేదన్నా... మాటయాభై పైన జేసద్దీ. కానీ ముందు ఈ మాట రేపెట్టినోణ్ణే నేను కామట్టి ఒక పాతిక నష్టపడి (వట్టి మాట... కానీ గట్టి మాట)మాట పాతిక్కిస్తాను .. అంచేత మీరంతా తలా అయిదూ తలా నాలుగూ ఎవరి తాహతుకే తగ్గట్టు అళ్ళ (ఈ

## లో క ం తీ రు

'తాహతు' అన్నపదం ఇటువంటి వ్యవహారాల్లో దివ్యంగా పని చేస్తుందని వెంకట సుబ్బయ్యకి తెలుసు 'ఆడికున్న తాహతు నాకు లేదా' అని ఒకాయనా ఆ ఒకాయన కున్నపాటి తాహతు నాకు లేదా అని మరో కాయనా ఇలా ఒక్కరొక్కరే పోటీపడి, పోగుచేసి అవసరమనుకున్న మొత్తానికి రెట్టింపు సమకూర్చగల సమర్థులౌతారు) యేసుకుని డబ్బు జమకట్టండి రేపు సాయంత్రానికల్లా రావుణ్ణి పిలిచి ఆడి సైకిలు ఆడికిద్దాం. ఆడూ యిశ్వాసం గలోడు. మన మేలుంచుకోడు చిన్నం చితకా పని సాయమో మాట సాయమో చేస్తాడు గందా! యేమంటారు ?''అన్నాడు.

''అమ్మ నాయాలా! యిదా నీ యెత్తు'' అనుకున్నాడు అప్పటిదాకా మౌనంగావింటూ కూర్చున్న ప్రతిపక్ష సభ్యుడొకరు కానీ ప్రతిపక్షానికక్కడ నోరులేదు కదల్డానికి కాలూ చెయ్యి కూడా లేవు పక్షవాతం వచ్చి చాలోజులయింది అంచేత అక్కడ అన్నీ ఏకగ్రీవ తీర్మానాలే ఓటింగుకి కూడా చోటులేదు ఆ అవసరమూ లేదు చేతులెత్తేవాళ్లే మూడొంతుల పైచిలుకు వుంటారు.

ఏతావాతా తేలిందేమంటే —

ఆ మర్నాటి సాయంత్రానికల్లా రాముడి

సైకిలుని కట్టబెట్టాల

అలాగే కట్టబెట్టారు కూడా.

మురిసిపోయాడు టపా రాముడు.

తనమీద ఆ వూరి వాళ్లకి వున్న అ

మానానికీ, జాలికీ వాడి కళ్ళు చెమర్చాయి. ఆ రాత్రి వాడికి నిద్రపట్టలేదు... సైకిలునే అలా చూస్తుంటూ

కట్టుకున్న పెళ్ళాం కూడా అసూయ పడింది. ఆ సైకిలు మీద వాడికి అప్పుడే ఏర్పడిపోయిన ప్రేమని తలుచుకుని. అంత నిద్దట్లోనూ, మూలనవున్న 'సైకిలుకేసి' చూసినట్లు ఈర్ష్యగా చూసి, 'నా కన్యాయం చెయ్యకూకు మావా' అనుకుంటూ కళ్ల నీళ్లు పెట్టుకుని – దూలానికి అంతుక్కు కున్నాబల్లిలా—మొగుడికి అతుక్కుపోయింది

# లోకం తీరు

వెర్రి బాగులది.

కట్టుకున్న పెళ్ళాం, కౌగిలిలో వున్నా ఆ రాత్రికి ఆమె నోట్లో కిరళ్ళాయకొట్టే మూలనవున్న సైకిలుకేసి మురిపెంగా చూసుకుంటూ కలత నిద్రపోయాడు రాముడారాత్రి.

తెల్లవారింది.

తుళ్లిపడి లేచాడు రాముడు.

సైకిలు తీశాడు. నిన్న తుడిచిందే అయినా మళ్ళీ తుడిచాడు పూలదండ వేశాడు కొబ్బరికాయ కొట్టాడు. వోసారి సైకిలెక్కి ఊరంతా తిరిగాడు. "పైలా పైలా పచ్చీసూ..." పాట పాడుకుంటూ మధ్యలో దాతలు కనపడినపుడల్లా దిగి దండాలు పెట్టాడు.

ఆ రోజు వాడు చాలా హుషారుగా డ్యూటీకి వెళ్ళాడు.

అలా నాల్రోజులు గడిచిపోయాయి.

అయిదోరోజు వుదయం డ్యూటీకి వెళ్ల బోతుంటే, ఆదిశేషయ్యగారి అబ్బాయి—పదేళ్ల పైవాడు— వచ్చి, "రావుడూ! సైకిలిస్తా తోట్లోకెళ్తాం" అన్నాడు.

"నేను డ్యూటీకెళ్ళాలిగా మరి" న్నాడు రాముడు.

"ఏమో నాకదేం తెలీదు. మా నాన అడిగి తీసికెళ్లమన్నాడు" అన్నాడు ఆ కుర్రాడు పంతంగా.

పిల్లాడేదో ఆకలాయి తనానికి అడుగు తున్నాడనుకుని ఖాతరు చేయకుండా సైకి లెక్కబోయాడు రాముడు

ఎదురుగా ఆదిశేషయ్య పాలేరొచ్చాడు, "అబ్బాయిగారికి సైకిలిచ్చి పంపించమన్నారు అయ్యగారు" అంటూ

దిగి, సైకిలిచ్చి, సంచి భుజాన వేసుకుని బయల్దేరాడు రాముడు

ఆదిశేషయ్య గారబ్బాయి సైకిలెక్కి తోట్లో పోతూతుంటే దార్లో వెంకట్రామయ్యగారబ్బాయి చూసి, "మా జోరుగా బోతున్నావ్ సైకిలెక్కడిదెహె"అనడిగాడు

"టపా రావుడిది" అన్నాడు ఆదిశేషయ్య గారి అబ్బాయి.

"అదేంటీ. ఆడ్డ్యూటీ కెల్లలేదా ఇయ్యాల" అన్నాడు వెంకట్రామయ్యగారి అబ్బాయి.

"యెల్లాడులే రోజూ యెల్లల్లా నడిచీ పుట్టిన కాణ్ణించీ సైకిలెక్కి తిరుగు తున్నాడా యీడూ" అన్నాడు ఆదిశేషయ్య గారబ్బాయి తండ్రి మాటలని తలుచుకుని అనుకరిస్తూ.

ఫలితం—

మర్నాడు పొద్దున "నాకిస్తాడో లేదో చూద్దామని" వెళ్లిన వెంకట్రామయ్యగారి అబ్బాయి చేజిక్కింది ఆ సైకిలు

ఆరోజు కూడా సంచి భుజాన వేసుకుని కాళ్ళీడ్చుకుంటూ బయలుదేరాడు టపా రాముడు.

ఆ మరుసటి రోజు ఎల్లయ్యగారి అబ్బాయి తీసికెళ్ళాడు.

ఆ మర్రోజు ఇల్లయ్యగారి అబ్బాయి తీసికెళ్ళాడు.

మరురోజు మల్లయ్యగారి అబ్బాయి తీసి కెళ్ళాడు.

ఆ మరుసటిరోజు... ...

.. ఇలా ఆ వారంలో ఒక్కరోజు కూడా సైకిలెక్కి డ్యూటీకి పోలేదు రాముడు.

ఆ మరుసటి వారం కూడా ఒకటిరెండు

రోజులు ఇలాగే గడిచాక యికను మనసు వుండబట్టలేక, మర్నాడు సైకిలడగవచ్చిన పాతికేళ్ల వడుమువాడితో సవినయంగా మనవి చేసుకున్నాడు,"పది రోజుల మట్టీ నడిచే పోతున్నాను బాబూ. ."

అంతెత్తు ఎగిరాడు ఆ బాబుగారు.

"వూళ్ళో వాళ్ళందరికీ యిచ్చి, నాకి వొచ్చేసరికి ఏడుస్తావేరా అట్టా. ఇదేం నీ అ. మొగుడి సొమ్మనుకున్నావా! బేవార్సు సైకిలు గుర్తుంచుకో దీని మొదాక అయిదు రూపాయలు యిచ్చుకున్నాన్నేను. అవసరంవచ్చి ఒక్కరోజు అడిగేతలికి అట్టా యిదయి పోతావేం. రోజూ నడిచి పోతల్లా. అట్టాగే యివ్వాలా నడిచిపో .."

నాలిక్కరుచుకుని చెంపలేసు కున్నాడు రాముడు.

గుంజీలు కూడా తీద్దామనుకున్నాడు కానీ, ఆ వచ్చినాయన వాడి ప్రయత్నాన్ని గమనించకుండానే సైకిలేసుకుని వెళ్ళి పోయాడు.

హీరోయిన్ని విలన్ పట్టుకు పోతుంటే నిస్సహాయంగా నిలబడిపోయిన అర్భక హీరోలా దుఃఖం దిగమింగుకుంటూ నిలుచు న్నాడు రాముడు.

ఆ తర్వాత నాలుగయిదు రోజులు మాత్రం వరసగా సైకిలు చేతికందింది వాడికి.

అందిందని వాడేమీ సంబర పడలేదు.

ఎక్కడ ఏమి అవాంతరం రానున్నదోనని, ఎప్పటి కప్పుడు అరచేతిలో సైకిలు పెట్టు కుని బితుకు బితుకు మంటూనే వున్నాడు.

రానే వచ్చిపడింది ఓ చిక్కు సమస్య ఓ నాడు.

ఆ వుదయం పొద్దు పొడవకుండానే వచ్చి చెప్పాడు రంగయ్య గారి పాలేరు, "మా బాబుగారికి సైకిలు కావాల ట. ఇంకాస్సేపాగి తోటకాడికి ఎల్తా ఇటాస్తా రంట ఎవరికీ ఇవ్వమాకు సైకిలు" అని.

సరే ఎన్నాడు రాముడు.

సరిగ్గా మరో రెండు నిమిషాలు గడిచే సరికి చెంగయ్యగారి పాలేరు వచ్చి "మా అయ్యగారు బస్తీకి పోవాలంట. సైకిలు తెమ్మన్నారు" అన్నాడు.

"ఎట్టాగా ? రంగయ్యగారబ్బాయికి కావాలంట. ఎవరికీ ఇవ్వద్దని కబురంపారు" అన్నాడు రాముడు... ఇదెక్కడి సంకటంరా దేవుడా అనుకుంటూ

నాదేముందంటూ ఆ వార్త చెంగయ్య గారికి మోశాడు వారి పాలేరు. చెంగయ్య గారి అబ్బాయి చెంగున వచ్చి వాలాడు.

ఆ సరికి రంగయ్యగారి అబ్బాయి కూడా వచ్చి వున్నాడు.

'వాడి ఎక్కువేమిటీ. నా తక్కువేమిటీ' అన్న ఆలోచన ఇద్దరిలోనూ నాట్యం మానేసి విందులు తొక్కుతోంది కూడా'

వాళ్లిద్దరిమధ్యా బిక్కమొహం పెట్టు కుని కాసేపు నిలబడ్డాడు రాముడు. ఏం చెయ్యాలో తోచక ఇద్దరి మొహాల్లోకీ మార్చి మార్చి చూశాడు. కానీ అవిరెండూ ఎర్రగా కందగడ్డల్లాగా తీక్షణంగా తనకేసి చూసేసరికి రారెత్తిపోయి దిక్కులు చూశాడు. చుక్కలు లెక్కపెట్టబోయాడు కానీ అవి లేవని తెలిసి నాలిక్కరుచు కున్నాడు. అలా నాలిక్కరుచుకుంటున్న సమయంలో వాడికో ఆలోచన వచ్చింది.

చెంగయ్యగారి అబ్బయిచేత తిట్లు తినక తప్పదని తెలిసినా, చివరకి ధైర్యంచేసి ఒక నిర్ణయం చేశాడు' ముందు అడిగినది రంగయ్యగారి అబ్బాయి కాబట్టి ఆయనకే సైకిలు ఇస్తాను. ఆయన తోటలేకేగదా వెళ్లేది. సైకిలు రాగానే మీకు పంపుతాను. మీరు బస్తీకి వెళ్లవచ్చు' అన్నది వాడి నిర్ణయంయొక్క సారాంశం.

"హుఁ" అని హుంకరించి. "సరే అలాగే పంపు" అని గజానికో అంగ వేసు కుంటూ వెళ్లిపోయాడు చెంగయ్యగారి అబ్బాయి

"హు" అని నిట్టూర్చి అంగుళానికో అంగ వేసుకుంటూ ఇంట్లోకి వచ్చాడు రాముడు

ఆనక సైకిలు రంగయ్యగారి అబ్బాయి నుంచీ వచ్చాక, దానిని స్వయంగా తీసుకు వెళ్లి—కన్నకూతురిని తీసికెళ్లి కసాయివాడి చేతిలో పెడుతున్నట్లు ఫీలవుతూ (ఎందు కంటే చెంగయ్యగారి అబ్బాయి చేతిలో సైకిళ్లు ఆగవు. ఆయన సైకిలెక్కితే భూమి ఆగదు అని అంత్రకితమే ఘనత వహించిన ఘనుడాతడు) చెంగయ్యగారి అబ్బాయికి అప్పగించి, తను సంచీ భుజాన వేసుకుని డ్యూటీకి వెళ్లాడు.

ఆ సాయంత్రం ఆరుమ్ముప్పావుకి, చీకట్లు బాగా కమ్ముకుంటున్న సమయంలో,



చెంగయ్యగారి పాలేరు సైకిలుని భద్రంగా తీసుకువచ్చి రాముడికి అప్పగించాడు

తప్పిపోయి తిరిగివచ్చిన కుర్రాడిని కన్ల జూసుకుంటున్న కన్నతల్లిలా మురిసెంగా సైకిలుకేసి చూసుకుంటూ ఆ మసక చీకట్లో దానికేసి పరకాయించి చూసుకో కుండా లోపల పెట్టుకున్నాడు రాముడు.

ఆ మర్నాడు బయటకుతీసి అధిరోహించ బోతుంటే టకటక లాడింది సైకిలు.

గుబగుబ లాడింది గుండె. గటుక్కున దిగి చూసుకున్నాడు.

ఫోర్కు విరిగి వుంది. అతుకు వేయించినా పనికిరాని స్థితిలో వుంది. కొత్తది వేయిం చాల్సిందే

ఏడుపొచ్చింది రాముడికి ఎవర్ని అడుగు తాడు. ఏమని అడుగుతాడు ఎలా అడుగు తాడు. అసలే బేవార్సు సైకిలు నీరు గట్టిగా నొక్కుకుని వూరుకున్నాడు

దానిని బాగు చేయించటానికి కూడా వాడిదగ్గిర డబ్బుల్లేవు.

వాడికి వోఆలోచన తటుక్కున మెరిసింది.

దీనిని బాగు చేయించి, మళ్లీ కోరి గొడవలు తెచ్చుకొనేకంటే ...

... దాన్ని అలాగే మూల పడవేశాడు రాముడు.

దానిచుట్టూ, దాని చక్రాలంత సాలె గూళ్లు అల్లుకొని వుండగా, అది అలాగే పడివుంది.

రాముడు మామూలుగానే సంచీ భుజాన వేసుకుని, ఈదురోమంటూ నడిచివెళ్లి నడిచి వస్తూనే వున్నాడు

# సీరియల్

*(గత సంచిక తరువాయి)*

చలపతిరావు భార్యవైపు చూశాడు.

తరువాత నెమ్మదిగా ఆమెను సమీపించి "బయల్దేరు కామాక్షి" అన్నాడు.

ఆ మాటకోసమే ఎదురు చూస్తున్నట్లుగా ఆమె ముందుకు నడిచింది.

* * *

టాక్సీ హాస్పిటల్ చేరుకోగానే అందరూ ఒక్క ఉరుకున దిగి ఎమర్జన్సీ వార్డుకు పరుగెత్తారు.

కానీ వాళ్లకు నిరాశే ఎదురైంది.

సుజాత అక్కడ లేదు.

"గాభరాపడవలసిందేమీ లేదు. పైపైన దెబ్బలు తగిలాయి. ముందు స్కల్ ఫ్రాక్చరయిందేమోనని భయపడ్డాంగాని కాలేదు. మామూలుగా ట్రీట్‌చేసి దెబ్బలకు కట్లు కట్టి డిశ్చార్జి చేశాం. వాళ్లంతా వెళ్లిపోయి ఇంకా పది నిమిషాలే" అయింది అన్నాడు. డ్యూటీలో ఉన్న సర్జను.

అందరి మనసులు తేలికపడ్డాయి.

మరి కాస్సేపటిలో టాక్సీ విక్టర్ ఇంటి ముందు ఆగింది.

అందరూ బిలబిలమంటూ లోనికి పరుపరుగెత్తారు

"దయచెయ్యండి. చాలా సంతోషం " అంటూ ఎదురువెళ్ళి చలపతిరావును, అవధానిగారిని ఆహ్వానించారు, శివరావుగారు

"అమ్మాయి . అమ్మాయి ఎలా వుంది?" కామాక్షమ్మ ఆదుర్దాగా అడిగింది

"భయపడవలసిందేం లేదమ్మా! చిన్న దెబ్బలు. మీరు లోనికి వెళ్ళండి. లోపలే ఉన్నారు ఆడవాళ్లంతా!" అన్నారు శివరావుగారు

కామాక్షమ్మ లోపలికి వెళ్లేసరికి సుజాతకు ఒకవైపు శివరావుగారి భార్య, రెండో వైపు రజని, నిరంజన్ భార్య ఉన్నారు

నుదుటిమీద ఒక కట్టు . మోచేతుల దగ్గర కట్లు సుజాత దిండును ఆనుకొని కళ్ళు మూసుకొని ఉంది. .

కామాక్షమ్మను చూడగానే రజని సుజాతనుతట్టి . "సుజీ మీ అమ్మ గారు వచ్చారు ." అని చెప్పింది!

"ఊఁ." అని చిన్నగా మూలిగి కళ్ళు

# తమసోమా జ్యోతిర్గమయ

ఎం. పి. ఆర్. రాధాకృష్ణ

తెరిచింది, సుజాత! ఎదురుగా కామాక్షమ్మ.

గుడ్ల నీరు కక్కుకుని తనవైపే చూస్తున్నది. సుజాత తనవైపు చూడగానే కామాక్షమ్మ ఒక్క అంగలో కూతుర్ని చేరుకొని పొదివి పట్టుకొని నోటమాటరాక, ఒక్కకన్నీరే సర్వంగా తనివితీర చూడ సాగింది.

సుజాత అచేతనంగా తల్లి కళ్లలోనికి చూస్తూ ఉండిపోయింది. ఆ అపూర్వమైన సమాగాన్ని చూసిన మిగిలిన వారిమనసులు బరువెక్కాయి.

అందరిలో ముందు చైతన్యంలోనికి వచ్చిన శివరావుగారి సతీమణి కామాక్షమ్మ భుజంమీద చేయివేసి "అమ్మాయికి వచ్చిన ఆపదేంలేదు, వదినగారూ! మీచల్లని దీవెనల వల్ల బ్రతికి బయటపడింది..." అంది!

కామాక్షమ్మ కూతుర్ని పొదివిపట్టుకొని ముద్దులతో వొళ్లంతా నింపేసింది...

"మాతల్లీ! బ్రతికి బయట పడ్డావు అదే చాలమ్మా నాకు. అదేచాలు." అంది. మమతానురాగాలు కన్నీరై వర్షించగా!

"పాపిష్టిదాన్ని! నాశాపమే తగిలింది నీకు. కన్నతల్లినై ఉండి కూడా నీమీద పగ పట్టాను. నాకు నిష్కృతిలేదు." అంది, మళ్లీ అదే స్థితిలో!

"అమ్మా..." సుజాతబాధగా అంది... "అలా అనకమ్మా! బయటకు కఠినమే అయినా. నీమనసు నవనీతం. ఎప్పుడూ నా సుఖాన్నేకోరావు. అటువంటి నిన్ను ఇంత కాలంతీరని మనోవ్యధకు గురిచేశాను. నన్ను క్షమించమ్మా!"

శివరావుగారి భార్యనవ్వింది: "మొత్తానికి అంతాకలిశారు. అదే చాలు..." అంది, ఆనందంగా!

"అమ్మా..." కామాక్షమ్మ ఆవిడ చేతులు పట్టుకుంది... "కూతురు కానిపని చేస్తున్నదన్న కసితో.. కన్నతల్లినైనా కసిరికొట్టాను. కానీ మీరు కడుపున పెట్టుకొని ఆదరించారు, నాబిడ్డను! మీ రుణం ఈ జన్మలో తీర్చుకోలేను..." అంది, కృతజ్ఞతా పూర్వకంగా!

"దానికేముంది అవసరమన్న తరువాత ఎవరో ఒకరు సాయపడాలి. రేపు ఇదే పరిస్థితి ఎదురైతే. నాబిడ్డకు మీరే చేస్తారు ఈమాత్రం సాయం..." అందావిడ!

ఇంతలో శివరావుగారు, చలపతిరావు, అవధానిగారు లోనికి వచ్చారు.

చలపతిరావు కూతురు దగ్గరకు వెళ్లి తలనిమిరి "ఎలా వుందమ్మా!" అని అడిగాడు.

"నాన్నా..." సుజాత లేవబోయింది.

చలపతిరావు వారించాడు: "వద్దు. లేవకు" అని ఆమె తల నిమురుతూ అలా చూస్తూ వుండిపోయాడు.

తరువాత నెమ్మదిగా గొంతు పెగల్చుకొని "జరిగినదేదో జరిగిపోయింది. నా మీద కోపం ఉంచుకోకమ్మా" అన్నాడు...

"నాన్నా..." సుజాత బాధగా తల ఆడించింది. "తిరిగి మీ ఆదరాభిమానాలు లభించాయి నాకు. అదిచాలు ఈ జన్మకు." అంది తండ్రివైపు ఆప్యాయంగా చూస్తూ

"చూడమ్మా! నే నెవరినో నీకు తెలీదు. నీ చిన్నపుడు చూశాను నిన్ను..." అంటూ ముందుకు వచ్చారు అవధానిగారు. "మీనాన్న నాకు ప్రియ శిష్యుడులే! నువ్వంటే చలపతికి ప్రాణం అనుకో! నిన్ను దూరం చేశాడంటే ఇష్టపడి మనస్ఫూర్తిగా చేశాడనుకోకు. నలుగురి సంతృప్తికోసం అది అతనికి అతనే వేసుకున్న శిక్ష! అవేవీ మనసులో పెట్టుకోకు." అన్నారు.

మాటల్లోనే రామం కూడా లోనికి వచ్చాడు...

"అన్నయ్యా!" సుజాత ఆనందంగా అంది.

రామం కూడా చెల్లెలి దగ్గరగా వెళ్లి... "ఎక్కువగా మాట్లాడకమ్మా.... రెస్టు తీసుకో" అన్నాడు లాలనగా!

తరువాత మగవాళ్లంతా ఆ గది నుండి తిరిగి ముందు గదికి వచ్చి కూర్చున్నారు...

"చలపతి అల్లుడేడీ. అతన్ని చూడాలనుంది" అన్నారు అవధానిగారు.

"అతనూ, మావాడూ కలిసి బజారు వెళ్లారు. మందులు తేవడానికని." అని... "తమరెక్కడో చూసినట్లుంది. మీ పేరు రామావధాని గారా?" అని అడిగారు, శివరావుగారు.

"అయితే పోల్చావన్నమాట... నిన్నుయిందాకే గుర్తు పట్టాను. నీ చిన్నపుడు. మీనాన్నతో కలిసివచ్చేవాడివి మాయింటికి. చూశావా. ఇంకామర్చిపోలేదు నేను..." అన్నారు, అవధానిగారు!

"మీ ముందు మేమెంత, బాబూ!" అని నవ్వి... "మీవంటి పెద్దల ఆశీర్వచనంవల్లనే ఈనాడు ఈకుటుంబం యింతశుభ్రపదంగా తిరిగి, కలసింది." అన్నారు, శివరావుగారు.

"మన చేతుల్లో ఏముంది? అంతా ఆసర్వేశ్వరుని దయ." అని తేల్చేశారు, అవధానిగారు.

ఇంతలో విక్టర్, నిరంజన్ వచ్చారు

చలపతిరావును చూసి. ఆశ్చర్యపోయి, గుమ్మంలోనే ఆగిపోయాడు, విక్టర్!

"రావయ్యా రా! మీమామగారువచ్చారు. మీకోసం" అన్నారు, శివరావుగారు.

చలపతిరావు లేచి విక్టర్ దగ్గరకువెళ్లి. అతన్ని తన రెండుచేతులలోనికి తీసుకొని హృదయానికి గాఢంగా హత్తుకున్నాడు!

"నీగురించి అంతా విన్నాను బాబూ! నీచల్లని నీడలో నాచిట్టితల్లి నిశ్చింతగా ఉందనీ తెలుసునాకు. ఉత్తమ సంస్కారం ఉన్నవాడివి. నిన్నుచూసి గర్వపడుతున్నాను." అన్నాడు.

విక్టర్ సిగ్గుపడి తలవంచుకున్నాడు.

చేతిలోని పళ్లబుట్టను లోపల పెట్టి తిరిగివచ్చాడు, నిరంజన్!

"ఆనాడు నేను చెప్తే విన్నారు కాదు. ఇప్పుడు మీరే చూసుకోండి, మీ అల్లుణ్ని!" అన్నాడు, చలపతిరావుతో పరిహాసంగా!

అందరూ హాయిగా నవ్వుకున్నారు...

మబ్బులు విడిచిన ఆకాశంలా...

గ్రహణం విడిచిన చంద్రునిలా...

పట్టుదలలు, కోపాలు, పంతాలు, పిచ్చి నమ్మకాలు...విడిచిన ఆవ్యక్తులు.

ఆనందగా కలిసిపోయి, వ్యత్యాసాల్ని మర్చిపోయి. ఒకటయ్యారు.

## 11

రెండు దినాలు ఇట్టే దొర్లిపోయాయి.

సుజాత బాగా కోలుకుంది, మానసికమైన సంతృప్తి వలన ఎవరూ ఊహించ

ంత శ్రీఘంగా ఆమె కోలుకుంది.

ఈ రెండు రోజులు ఎవరినీ వాళ్ల ఇళ్లకు పెళ్లనీలేదు విక్టర్!

అతను వో వారం రోజులు సెలవు పెట్టేశాడు.

ఆ రోజు...

మధ్యాహ్నం అందరూ ఒకచోట చేరి ఉల్లాసంగా కబుర్లు చెప్పుకుంటున్న

## తమసోమా జ్యోతిర్గమయ

తరుణంలో ..

ఇంటి ముందు టాక్సీ ఆగింది

దానిలో నుండి దిగి లోనికి వస్తున్న అరుణను చూడగానే అందరూ అవాక్కయిపోయారు.

సుజాత ఒక్క పరుగున వెళ్ళి అరుణను కావలించుకుంది.

''అరుణా ఎలా వున్నావే! ఏమైపోయావు ఇంతకాలం? ఎంత కష్టపెట్టావే మమ్మల్ని'' అంటూ చిన్నగా రోదించసాగింది

రజ కూడా చేరి వాళ్ళిద్దర్నీ ఓదార్చుకొని కంటతడి పెట్టింది

టాక్సీవాడికి డబ్బులిచ్చి పంపేసి లవ్వాడే లోనికివచ్చిన మురళి ఆ దృశ్యాన్ని చూసి గుమ్మంలోనే ఆగిపోయాడు.

ముగ్గురి హృదయాలలో బరువు తగ్గాక విడివడి గుమ్మంవైపు చూస్తే... మురళి కనిపించాడు.

''చిన్నన్నయ్యా'' సుజాత ఆనందాతిరేకంతో చిన్న కేక వంటిది వేసింది.

అప్పుడు చూశాడు మురళి...

ఒక్క అంగలో చెల్లెల్ని చేరి... ''ఏమిటమ్మా యిది. ఈ కన్నీళ్ళేమిటి? ఏమైందినీకు. చెప్పమ్మా'' అన్నాడు.

''ఏమీ లేదురా. చిన్న ఆక్సిడెంట్, ఇప్పుడు బాగానే వుంది'' అన్నాడు చలపతిరావు, కూర్చున్న చోటి నుంచి లేచివచ్చి!

అంతవరకూ తండ్రి ఉనికిని గమనించని మురళి... అతన్ని చూడగానే ఆశ్చర్యపోయి చుట్టూ చూశాడు!

తల్లి కామాక్షమ్మ, రామం కనిపించారు.

''ఆహా. ఏమిసుదినం. అందరూ ఇక్కడే ఉన్నారే...'' అన్నాడు, మహదానందంగా!

''అన్నినదులు సముద్రంలోనే కలిసినట్లు మనుషులంతా ఒకేచోట చేర్తారు... అదీ రూలు.'' అన్నాడు, నిరంజన్!

''కాబట్టి. ఇప్పుడే మీకో ముఖ్యమైన వార్త చెప్పబోతున్నాను...'' మురళిగొంతు సవరించుకొని అన్నాడు...

ఏమిటన్నట్లు చూశారంతా!

''నేను చెప్పబోయే వార్తను మీరెలా తీసుకుంటారో నాకు తెలీదు. మీ రియాక్షన్ ఎలా ఉంటుందో ఊహించలేనుకూడా! మీరు ఔనని నన్ను సమర్థిస్తే లోనికి వస్తాను కాదని గర్హిస్తే. ఇటునుండిటే వెళ్ళిపోతాను అందుకే ఇంకా గుమ్మానికి దగ్గర్లోనే ఉన్నాను...''

''ఆపేద్దేదో. తిన్నగా ఏడవ్వోయ్. డైలాగులు చెప్పకు...'' చలపతిరావు విసుక్కున్నాడు.

''ఓకే! అయితే చెప్పేస్తున్నాను, వినండి!''

**జరిగినకద 11** చలపతిరావు, కామాక్షమ్మలకు సుజాత ఒక్కతే కూతురు. సుజాత పెద్దన్న రామం ఉద్యోగంలేక, చిన్నన్న మురళి నాటకాల పిచ్చితోను తిరుగుతుంటారు సుజాత, అరుణ, రజని క్లాస్‌మేట్స్ అరుణ టెన్నిస్ ఆటగాడు శేఖర్‌ని ప్రేమిస్తుంది. తన పెళ్ళికి కట్నంకోసం ఇల్లమ్ముకోవటంతో పెళ్ళే చేసుకోనంటుంది సుజాత పరధ్యానంగా నడుస్తూ బస్సుక్రింద పడబోతున్న సుజాతని రక్షిస్తాడు విక్టర్ మిమ్మల్ని అరుణని ప్రేమించినంతకం టె గాఢంగా ప్రేమిస్తున్నాను మీకోసం ఏదైనా చేస్తానన్న శేఖర్‌ని చీవాట్లేస్తుంది సుజాత. విక్టర్, సుజాత సన్నిహితులవుతారు శేఖర్‌మీది వెర్రి వ్యామోహం అతని రూమ్‌కెళ్ళేలా చేస్తుంది అరుణని. విక్టర్‌కీ, సుజాతకీ వివాహం చేయమని అడగవచ్చిన రజని తండ్రి శివరావుగార్ని నిందిస్తాడు చలపతిరావు తల్లితండ్రులని కాదని సుజాత విక్టర్‌ని పెళ్ళాడుతుంది. సుజాత విక్టర్‌ని పెళ్ళాడటంవల్ల తమ పరువు ప్రతిష్ఠ పోయాయని బాధ పడుతుంటారు చలపతిరావు కుటుంబ సభ్యులు శేఖర్‌వల్ల మోస పోయి ఆత్మహత్య చేసుకోబోతున్న అరుణని కాపాడుతాడు మురళి. మీ కభ్యంతరం లేకపోతే మిమ్మల్ని నేను పెళ్ళిచేసుకుంటానంటాడు మురళి అరుణతో.

మురళి మళ్లీ గొంతు సవరించుకున్నాడు. 'అరుణను నేను వివాహం చేసుకోవాలని నిశ్చయించుకున్నాను.''

"ఆఁ" అందరూ ఆశ్చర్యపోయారు.

"అవును. అరుణను నేను వివాహం చేసుకోబోతున్నాను" మురళి చెప్పసాగాడు.

"మీలో చాలా మందికి నా నిర్ణయం నచ్చదని నాకు తెలుసు అయినా నేను లక్ష్య పెట్టదలచుకోలేదు అరుణ గతజీవితమేమిటనేది నాకు అనవసరం. పరిస్థితులు ప్రతికూలిస్తే ఎవరి జీవితమైనా చింపిన విస్తరే అవుతుంది

ఈ పరిస్థితులనేవి ఎక్కడున్నాయి... అవి గాలిలో ప్రేల్లాడటంలేదు

మనం అంటే ఈ సమాజంలోని మనుషులం మనమే సృష్టిస్తున్నామా పరిస్థితుల్ని! ఉన్నాయనుకుంటే అన్నీ ఉంటాయి లేదనుకుంటే ఏదీ ఉండదు. అటువంటివే ఈ పరిస్థితులు కూడా!

ఆచారాలు, సాంప్రదాయాలు వీటిపేరిట ఎన్నో కట్టుబాట్లు! వాటిలో అర్థవంతమైనవి బహు తక్కువ!

అవినీతిని సహించం మనం! కానీ అది సమాజంలో ఒక అంతర్భాగమైపోయింది కారణం. మనం ఏర్పరచుకున్న ముళ్ల కంచలే! ఆ కంచలను దాటలేక కాళ్లు తెగి ఏడుస్తున్నారు ఈనాటి యువతీ,యువకులు. మూఢ విశ్వాసాలనే అంధకారం నీడనీపుగా పెరిగింది అజ్ఞానం ఆ అజ్ఞానాన్ని పార ద్రోలి అంధకారాన్ని అంతంచేసి లమస్సు నుండి వెలుగులోనికి సమాజాన్ని నడిపించే బృహత్తరమైన బాధ్యత ఈనాటి యువతది నేనేదో త్యాగం చేస్తున్నానని సాధిస్తున్నానని అనుకోవడంలేదు. ఓ దగాపడిన ఆడకూతురికి నేనొక ఆవలంబననై ఆమె జీవితంలో తిరిగి నిజమైన జీవన రేఖలను నేను నింప గలిగితే అది చాలు నాకు అందుకే ఈ నిర్ణయం.'' మురళి మాట్లాడ్డం ఆపి, అందరివైపు చూశాడు ఎవరూ మాట్లాడలేదు ఒక్కక్షణం.

సుజాత అందరి కంటేముందు ఆశ్చర్యం నుండి తేరుకుని మురళిని ఆప్యాయంగా పట్టుకొని "నీ ఆదర్శానికి, ఔన్నత్యానికి ఏం మాట్లాడాలో తెలీకుండా ఉంది అరుణ నా ప్రాణం. దాని జీవితానికో వెలుగు చూపించిన నీకు నా కృతజ్ఞత ఎలా తెలుపుకునేది?'' అంది పరవశంగా!

కామాక్షమ్మ అరుణను దగ్గరకుతీసుకుని "సాటి ఆడదాన్ని కష్టాలలో నింపపరచడం మనకో అలవాటైపోయింది'' అని అరుణ తల నిమిరి... "నువ్వెవరనేది నాకు అనవసరం. నా కొడుకు నిన్ను మెచ్చి తెచ్చినప్పుడు నువ్వు నా బిడ్డవంటి దానివే! సుజాతలాగే నువ్వొకటే కాదు నాకు'' అంది!

కామాక్షమ్మ అంగీకారంతో ఆ వివాహాన్ని అందరూ అంగీకరించినట్లయింది.

"పనిలోపని ఈ గడుగ్గాయిక్కూడ ముక్కుతాడు బిగించాలి'' అన్నాడు విక్టర్ రజనివైపు చూసి!

"పాపం ఎవరా దురదృష్టవంతుడు'' రజని ఎగతాళిగా అంది.

"ఇంకెవరు? మన మాజీ సెల్స్‌మన్ గారే.'' అని నవ్వి. "నీ విషయమింకా కనిపెట్టామనుకోలే—'' అన్నాడు నిరంజన్!

"పోదూ మహ'' అంటూ సిగ్గుపడి పోయింది, రజని!

"ఎవరేమనుకున్నా మా వాళ్ళిద్దరి పెళ్ళి జరగాలి.''అన్నారుశివరావుగారు, చలపతిరావు వైపు క్రీగంట చూసి!

"వాళ్లంతా ఒకటయాక ఇంకా మన ఇష్టాయిష్టాలేమిటి? శుభం'' అన్నారు, చలపతిరావు.

కబురందు కొని హుటాహుటివచ్చారు, మాధవరావు దంపతులు. కూతుర్ని కావలించుకొని కన్నీరుకార్చి అనుకోకుండా కాపాడినందుకు మురళికి కృతజ్ఞతలు చెప్పబోతే

"అనవసరంగా శ్రమ పడకండి వాళ్ళిద్దరూ అప్పుడే కూడ బలుక్కున్నారు ఒకటిగా జీవించడానికి.'' అన్నాడు నిరంజన్ నవ్వి!

అందరూ సంబరంగా నవ్వుకున్నారు...
అంతా ఆనందమే...
అంతటా మహోత్సాహమ్...
తరతమాలు మరచి... విభేదాలుత్యజించి

## తవ: సోమా జ్యోతిర్గమ:యు

అందర్నూ ఒక్కట్నై...కలసి, మెలసి...తరిగి పెరిగి కలిసినందుకు...

ఆ కలయికలోని మహదానందం అది.
అందుకే... అంతటా—
నవ్వుల పువ్వులే అయాయి......

*(అయిపోయింది)*

## ఫోన్‌లో జోక్ !

న్యూయార్క్‌లో ఓ నంబరుకు గనుక ఫోను చేస్తే ఓ అందమైన గొంతున్నమ్మాయి ఓ జోకు చెప్పి నవ్విస్తుందట. హాయ్! హైకాన్నిండియా! ఇండియాలో ఫోను ఎత్తి ఏ నంబరుకు తిప్పినా జోకే కదా!

## ఇందిరా గాంధీ జ్ఞాపకాలు

ఇందిరాగాంధి తన జీవితంలోని ఘట్టాలను నా జ్ఞాపకాలు అనే పేరున ఓ పుస్తకంగా రాయ నిర్ణయించుకున్నారట. ఆ పుస్తకన్ని అమెరికా ప్రభుత్వం అచ్చువేయ సంకల్పించిందట. ఈ పుస్తకానికి ఇండియన్ ఎక్స్‌ప్రెస్ మాజీ ఎడిటర్ ఫ్రాంక్ మొరెస్ కుమారుడు డామ్ మొరెస్ సంపాదకుడట.

## తాకట్టు తెచ్చిన తంటా !

వాళప్పాడికి చెందిన గుండం అనే ఊరిలో 60 ఏళ్ల కణ్ణమ్మ కొడుకు 35 ఏళ్ల గోవిందుకు అతని తమ్ముడు 30 ఏళ్ల నటేశనుకు ఇంట్లోని ఇత్తడి సామాను తాకట్టు పెట్టే విషయంలో పోట్లాట వచ్చిందట. ఆ రాత్రి అన్నం తిని నటేశన్ పడుకున్నాడట. గోవిందన్ మాత్రం అన్నం కూడా తినకుండా అటూ ఇటూ తిరుగుతూ ఆలోచిస్తున్నవాడల్లా, ఉన్నట్టుండి లటకమిాదున్న గొడ్డలి తీసి తమ్ముణ్ణి ఆ గొడ్డలితో ముక్కలు ముక్కలుగా నరికి పారిపోయాడట.



## మంచి హోటల్ లేక విమానాలు బంద్ !

ఇరాన్‌దేశ రాజధాని టెహరాన్ నగరంలో చక్కని హోటలు మచ్చుకొక్కటైనా లేదని ఎయిర్ ఇండియావారు కింకపడి, తత్ఫలితంగా ఆ దేశం మిాదుగా మేం విమానమే నడపం అనో తీర్మానం చేసుకున్నారట.

## అపూర్వ సహోదరులు !

ఇటలీ దేశంలో ఓ బ్యాంకులో ఓ యువకుడు జామ్మని దొంగతనం చేశాడట. పోలీసు రిపోర్టు తెరాం, అనవాళ్ళ, పోలీసులు కనుక్కొని వస్తారనిపోయే ఒకల్ని వాటెయనుకుంటే ఆ ఇసామీ నబ్బిన మొహమ్కుని నేకాదుబాబో, ఇది మా తమ్ముడి పని అని గోలపెట్టాడట. సరి అని అతణ్ణి వదిలేసి మరొకణ్ణి పట్టుకుంటే అతనూ అలానే అన్నాడట. ఇద్దర్నీ పట్టుకుని పోలీసులు చూస్తే ఎవరెవరో కూడా తెలియనంత పోలికలతో వారున్నారట. ఆశ్చర్యపోయిన పోలీసుల్ని చూసి ఆ అపూర్వ సహోదరులు నవ్వి మారు కాదు మా అమ్మకూడా మమ్మల్ని కనిపెట్టలేదు పొమ్మన్నారట! ఇహ గోల ఎలాగున్నమాటా!

## లక్షదీవులు మనవికావా !

భారతదేశానికి చెందిన లక్షదీవులకు చేరిన ఒరదీవుకు ఒహాయిహో ఉత్తరం రాస్తే అది తిరిగి ఆయనకే వచ్చేసిందట. కారణమేమై యుండునని చూస్తే విదేశాలకి పోడనికి తప్పరానికంటించాల్సిన స్టాంపులు అంటించలేదని తపాలాశాఖ ఆ ఉత్తరం మిాదో రిమార్కు రాసి పారేసిందట. పాంమా! లక్షదీవు మనదేశానికి చెందినదేనని సంద్రం అయిందగా తపాలా శాఖ ఒప్పుకోనక్కోనా లెక్క.

## నాలుగో నెలలో మాటలు—పద్నాలుగో నెలలో చదువు !

మాస్కోలో ఒకావిడకు పుట్టిన పసిగుడ్డు నాలుగో నెలలోనే మాట్లాడటం ఆరంభించిందట. అదేమని తలిదండ్రులాశ్చర్యపోతే పద్నాలుగో నెల వచ్చేసరికి వార్తాపత్రికలో వడ్డ [illegible] న్యూసు చదామడా చదివేస్తోందటా పసికందు!

## ఆరోగ్య రహస్యం !

బొంబాయి నగర మేయరు బొంబాయిలో ఉండేవారిలో నూరు సంవత్సరాలకు పైబడి జీవిస్తున్నారిందరినీ సమీకరించి, ఓ సభ ఏర్పాటు చేసి సత్కరించారట. వారిలో 104 ఏళ్ల వయస్సావిడని అమ్మా మీ ఆరోగ్య రహస్యమేమిటనడిగితే ఆ అమ్మ నేను నెలకు పదిహేను రోజులు తిండి లేకుండానే ఉంటాన్నాననా అన్నదట. భవా ఇదే ఎక్కువ కాలం [illegible] దానికారణమైతే భారతదేశంలో చాలామంది ఎక్కువకాలం జీవించి తీరాల్సిందే! కదా!

## డాక్టర్ సలహాలు

**సి హెచ్ ఎ దొడ్డిపట్ల**

నా వయస్సు 19 సం లు నేను మెన్సెస్ అయి నప్పుడు ప్రతినెలా మొదటిరోజు కడుపునొప్పిగా ఉండి 3, 4 విరోచనాలు అవుతాయి ఇలా ఎందుకు జరుగుతుంది విరోచనాలకీ, మెన్సెస్‌కి ఏమైనా సంబంధముం ఉన్నదా ?

విరేచనాలకీ, మెన్సెస్‌కీ సంబంధంలేదు. ఖంగారు, ఆదుర్దావల్ల దానితోడు కడుపునొప్పి ఉండటంవల్ల ఈ రెండింటికీ సంబంధం ఉందని మీరు అపోహపడటం తప్పని నా అభిప్రాయం.

**ఎమ్ కె కె. కోవూరు**

మా అక్కకూతురు వయస్సు 2న్నర సం లు రెండు నెలల క్రిందట జ్వరము వచ్చింది. పాపనవ్వినా ఏడ్చినా మూతి కొద్దిగా కుడివైపుకు పోతుంది ఎడమకన్ను రెప్పకొట్టటంలేదు. కన్ను నీరుకారుతుంది. వెంటనే పిల్లల డాక్టర్ దగ్గరకు తీసుకొని వెడితే ఇది పోలియో కాదని వాయు సంబంధమైనదని 40 రోజులు మందులు వాడమని వ్రాసిఇచ్చారు కాని పాపకి ఇంతవరకూ బాగుకాలేదు. పాప పెద్దయ్యాకైనా మూతి, కన్ను బాగవుతాయా ?

పాపకి ఏర్పడిన రోగం బెల్స్‌పాల్సీ అనే — మెదడునుంచి ముఖంలోని కండరాలకివెళ్లే ఏడవ నరం— చెవిలో నుంచి వెలువడే భాగంలో దెబ్బ తినటంవల్ల ఏర్పడుతుంది.

క్రమేణా, ఆ కండరాలను ఫిజియోథెరపీ [ఎక్సర్‌సైజ్] చేయుడంవల్ల వయస్సు పైబడేన కొద్దీ నయమయ్యే అవకాశం ఉన్నది.

**వి ఆర్ రామచంద్రపురం**

మా అబ్బాయి వయస్సు 6 సం లు మొదటినుండ నడక సరిగా రాలేదు. మడమలు ఎత్తివేళ్ళ మీద నడుస్తాడు. నడుస్తూ, నడుస్తూ పడిపోతూ ఉంటాడు. నడుస్తుంటే కాలివేళ్ళు నేలకు రాసుకుంటూ వుంటాయి. తెలివితేటలు బాగా ఉన్నాయి. మాటలుబాగా మాట్లాడులాడు. కాళ్ళు చేతులు మామూలుగా బలంగా వుంటాయి. చిన్న గడపగూడా దాటలేడు. నడుస్తూ నడుస్తూ ఎక్కువగా వెనక్కి పడుతూ ఉంటాడు. చిన్నప్పుడు జబ్బుచేస్తే పిర్రలమీద ఇంజక్షనులు చేశారు. అవి గుంటలు పడ్డాయి. ఆ గుంటలవల్ల నడవలేక పోతున్నాడేమోనని నా అనుమానము.

మీరు వ్రాసిన పరిస్థితికి శస్త్ర వైద్యులకి చూపించి, కాళ్లకివెళ్లేనరాలు సరిగాపని చేయకపోవటం వల్లనో లేక, పుట్టుకతో ఏర్పడే టాలిపెస్ ఈక్వినో వారస్ అనే రోగంవలన వచ్చిందా అని నిర్ణయించుకొని తగిన వైద్యం చేయించుకోవాలిగాని మీస్వంత అనుమానాల వల్ల మాత్రం రోగికి లాభంలేదు.

**ఎస్. ఎస్ ఎన్ ఎమ్ వేలంగి**

నేను డయాబిటిస్ మెల్లిటస్ అనే వ్యాధితో బాధపడుతున్నాను. డాక్టరు సలహాపై మందులు వాడినా తగ్గలేదు. మీ సలహా ఇవ్వప్రార్థన.

డాక్టరు చెప్పే సలహాలన్నీ దాదాపు ఒకే విధంగా, ఉంటాయి. శాస్త్రంలో మేము తెలుసుకొన్నవి మాత్రమే చెప్పగలం కాబట్టి ఒకే రోగానికి రెండు రకాల సలహాలు ఉండవు [అరుదుగా తప్ప] నాసలహా మీ డాక్టర్‌గారు సూచించిన మందులని క్రమం తప్పకుండా వాడి క్రమంగా పరీక్ష చేయించుకోమని.

**జి. బి. సికింద్రాబాద్**

మా పాప వయస్సు 2 సం లు పాపకి ఒక సంవత్సరము నుండి జ్వరము వచ్చినప్పుడు ఫిట్స్ వస్తున్నది డాక్టరు సలహాపై మందులు వాడుతున్నాం. ఫిట్స్ వలన ఏమైనా ప్రమాదమా ? ఫిట్సు వచ్చినప్పుడు తీసుకోవలసిన జాగ్రత్తలు, రాకుండా వుండటానికి ఏమి చెయ్యాలి, వీటికి కారణమేమిటి తెలుపప్రార్థన

జ్వరం వచ్చినప్పుడల్లా ఫిట్స్ రావటాని

ఫీబ్రైల్ ఫిట్స్ అంటారు. పిల్లలలో ఈ 'సెల్స్' ఒక పరిమితికి మించి ఉష్ణోగ్రతను భరించలేక వాటికి సంబంధించిన కండరాలు ప్రేరేపింపడం వలననే ఈ ఫిట్సు ఏర్పడతాయి.

## డాక్టర్ సలహాలు

దీనికి నివారణ, జ్వరం ఎక్కువ రాకుండా ...దలు [మెజారాల్ మాత్రలు] వాడటం తర్వాత

వైద్యుల సలహా ప్రకారం ...ల కారణానికి మందులు వాడాలి. క్రమేణా వయస్సు మీరిన కొద్దీ ఈ లక్షణం కాలగతిలో సమసిపోతుంది.

—డా. కె. వెంకటేశ్వరరావు

# హైదరాబాద్ నోట్ బుక్

## రత్నాకర బాలరాజు

ఉపనిషత్కాలం నుంచి తత్త్వోపదేష్టలు చాలవరకు క్షత్రియులే కనిపిస్తున్నారు ప్రస్థాన త్రయంలో ఒకటయిన భగవద్గీతను ఉపదేశించిన కృష్ణభగవానుడు క్షత్రియుడు ఆయన కర్మ యోగంలో ఉదహరించిన జనకుడు క్షత్రియుడు. జైన ప్రస్థాన ప్రవర్తకుడు మహావీరుడు, బౌద్ధ ప్రస్థాన మూల పురుషుడైన తథాగతుడు క్షత్రియులు ఇక మన కాలానికి వస్తే భారతీయ వేదాంతానికి పాశ్చాత్యములలో పట్టం కట్టిన వివేకానందుడు, అధినూతన ప్రస్థానాచార్యుడయిన అరవిందయోగి క్షత్రియులు (వీరు కులీన కాయస్థులు క్షత్రియులుగా పరిగణన) తెలుగు దేశానికి వస్తే, తన అపూర్వ ప్రబోధాలతో భారత ప్రజలను ఆసేతుశీతనగం తన్మయింపజేస్తున్న అమోఘ వాక్కులయిన సత్యసాయి బాబా క్షత్రియులు,



తత్త్వోపదేష్టల రత్నాకరమైన ఈ క్షత్రియ కులంలో జన్మించారు మిత్రులు శ్రీ రత్నాకర బాలరాజు. రత్నాకర బాలరాజు యింటి పేరు బాలరాజులాంటి రత్నాలు ఎన్నో ఈ వంశంలో జనించి ఉంటారు కనుకనే ఈ వంశానికి, ఈ పేరు వచ్చి ఉంటుంది యింతకూ, సత్యసాయి బాబా వంటి అసదృశ మహోజ్జ్వల రత్నం ఉద్భవించిన వంశం రత్నాకరం కాక మరేమవుతుంది? విశాలమయిన ఫాలం, కోటేరును కొకిరించే సుదీర్ఘ నాసిక, తత్త్వ చింతన దీధితులను విరజిమ్ముతున్న కన్నులు, ఎంతసేపు మాట్లాడినా ఇంకా విందామనిపించే మృదు గంభీర కంఠరవం, ఈ ప్రపంచమంతా అనిత్యం, బ్రహ్మ ఒక్కటే సత్యమని సూచించే చిరునవ్వు నిరంతరం నర్తించే ముఖ కవళిక — యితడెవరో గొప్పవాడు సుమా అని సామాన్యునికి కూడా పట్టి ఇస్తాయి బాలరాజు ఏది మాట్లాడినా, ఏది చేసినా, బాలరాజు సానుభూతితో చేస్తారు ఆయన ప్రతి చర్యలో ఆస్తికతా సుగంధం గుబాళిస్తుంది ప్రతి సంభాషణలో ప్రపంచ తత్త్వవేత్తల సూక్తుల, సిద్ధాంతాల పూల జల్లులు పడుతుంటాయి యింతెందుకు? సామాన్య వేషంలో అసామాన్య జ్ఞాని బాలరాజు. అధ్యాత్మ రామాయణం పదునూడవ ఏటే కంఠస్థం డాక్టర్ రాధాకృష్ణన్ రచించిన బ్రహ్మసూత్రను అసందిగ్ధమూ అక్లిష్టమూ అయిన శైలితో పరమసుందరంగా తెలుగు చేయడమంటే బ్రహ్మసూత్రాలను బాలరాజు ఎన్నిసార్లు మననం చేసుకుని ఉంటాడో. ఈయన ఒక్క ఔపనిషదమైన తత్త్వ చింతలోనే కాక బౌద్ధ దర్శనంలోను పండితుడు బుద్ధ భగవానుని జీవితోపదేశ దర్శనాత్మకంగా బుద్ధ దర్శనము, క్రీస్తుపూర్వం 6వ శతాబ్ది నుంచి క్రీస్తు తర్వాత 7వ శతాబ్ది వరకు గల భారత దేశ రాజకీయ సాంస్కృతిక చరిత్రను రెండు సంపుటాలలో బౌద్ధ యుగము అనే పేర ఉద్గ్రంథాలు రచించారు ఈయన అనువదించిన బ్రహ్మసూత్రము అను వాదమే పదకొండు వందల పుటలలో యివి గాక ఈయన శ్రీ రామా నందలహరి, జగద్గురు శంకర భగవత్పాదుల జీవితోపదేశాలు తెలిపే శంకర మందారము, యాజ్ఞవల్క్య మహర్షి జీవిత చరితమయిన అమృతానుభవము, శ్రీ శుకమహర్షి చరితమయిన కల్యాణ కైవల్యము అనే గ్రంథాలు రచించారు యివన్నీ ముద్రితాలు, బహుజనాదృతాలు శ్రీకృష్ణస్తుతి మందాకిని, ప్రబోధ సుధాకరము శృంగార మంజరి అనే అముద్రిత పద్య కావ్యాలు ఉన్నాయి. శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంవారి డాక్టరేట్ పట్టాకు ఈయన సమర్పించిన సిద్ధాంత వ్యాసం సీతారామాంజనేయ సంవాద కావ్యము— ఒక సమాలోచనాత్మక పరిశీలనము ఈ గ్రంథాలన్నీ బాలరాజు నిరంతర తత్త్వ జిజ్ఞాసకు తార్కాణాలు. బాలరాజు స్వస్థలం అనంతపురం జిల్లా కదిరి తాలూకా కాళసముద్రం. జననీజనకులు శ్రీ సుబ్బమ్మ, భాస్కరరాజుగారలు. చిన్ననాటి విద్యాభ్యాసం హిందూపురంలోని యి సి ఎం హైస్కూలులోను, కదిరిలోని నేషనల్ బోర్డు హైస్కూలులోను జరిగింది. అనంతపురం ప్రభుత్వ కళాశాలలో పట్టభద్రులయ్యారు మద్రాసు విశ్వవిద్యాలయం ఎం. ఏ. పట్టం పుచ్చుకున్నారు కృష్ణ భగవానుడన్నట్టు శరీర యాత్రాపిచతే న ప్రసిద్ధ్యేద కర్మణః ఏ పని చేయకపోతే శరీర యాత్ర కూడా సిద్ధించదు గనుక, ప్రస్తుతం చిత్తూరు ప్రభుత్వ కళాశాలలో ప్రధానాంధ్రోపన్యాసకులుగా పనిచేస్తున్నారు ఆంధ్ర సంస్కృత ఆంగ్ల భాషలలో అసమాన పాండిత్యం గడించి, సహజమయిన ఆధ్యాత్మిక చింతనతో రచన సాగిస్తూ, రచనానుగుణంగా అధ్యాపనం చేస్తున్న బాలరాజు, సెప్టెంబరు 10వ తేదీకి 47 సంవత్సరాలు నిండిన బాలరాజు మరి 47 సంవత్సరాలయినా జీవించి, తన రచనలతో, కర్మలతో ప్రసంగాలతో ఆంధ్రావళిని తన్మయింప చేయగలరని ఆశిస్తున్నాను. నా ఆశలేవీ యింతవరకు వమ్ము కాలేదు

## శ్రీ రాజ్‌నారాయణ్ హామీలు

కేంద్ర ఆరోగ్య శాఖామంత్రి శ్రీ రాజనారాయన్ ఆగస్టు 7 వ తేదీన ఢిల్లీనుంచి బెంగుళూరుకు పోతూ బేగంపేట విమానాశ్రయంలో ఆగినప్పుడు శ్రీమతి టి. లక్ష్మీకాంతమ్మ, శ్రీయుతులు సాగి సూర్యనారాయణరాజు, బదరివిశాల్ పిట్టి, విధాన పరిషత్తు సభ్యులు రామారావు, బిషప్ జె. వి. జయరత్నం, కె ఎం ఖాన్ మున్నగువారు ఘనస్వాగతమిచ్చారు, రాష్ట్ర ప్రజారోగ్య శాఖోద్యోగులు, హోమియోపతి విద్యార్థులు ఆయనను కలుసుకొన్నారు కార్మికులు తమ ప్రయోజనాలసాధనకై సంఘాలు ఏర్పాటు చేసుకొనే హక్కును కేంద్ర ప్రభుత్వం గౌరవిస్తుందని, శ్రామిక వర్గ ప్రజాస్వామ్య హక్కును త్రోసిపుచ్చే ప్రసక్తి లేదని, రాజనారాయన్ స్పష్టపరిచారు హోమియోపతి విద్యార్థుల సమస్యల పై పరిశీలన జరుగుతుందని కూడ ఆయన హామీ యిచ్చారు.

## ఉపశ్రుతి

మీరు షష్ఠభయ్యోపడిలో ప్రవేశించినందుకు చాల సంతోషంగా ఉంది సెంచరీ కొట్టాలని ఆకాంక్షిస్తున్నాను అని డాక్టర్ గోపాలరెడ్డిని అభినందించాను. ప్చ్! క్రికెట్‌లోనే సెంచరీ కొట్టలేదు జీవితంలో ఏం కొడతాను లెండి? అన్నారు గోపాలరెడ్డి. ఒకదానిలో కొట్టనంత మాత్రాన మరొకదానిలో కొట్ట కూడదనేముందిట అని శ్రుతి కలిపారు సహృదయులొకరు

— తిరుమల రామచంద్ర.



నెహ్రూ 6వ సంగీత నృత్య కళాపరిషత్తులో ఉపన్యసిస్తున్న ఫటాఫట్ జయలక్ష్మి ప్రక్కన ఉన్న నెహ్రూ అధ్యక్షుడు సుందర రామిరెడ్డిని చూడవచ్చును.

## " ఒక కన్య చెప్పిన కథ పాఠకులతో రచయిత్రి ముఖాముఖీ

"ఒక కన్య చెప్పిన కథ ఓపికగా విన్న శ్రోతలకు నా కృతజ్ఞత! చదివిన పాఠకులకు హృదయపూర్వక అభినందనలు!

ఈ నవలలో నాయికలు, నాయిక, సహోత్తర వైన ప్రేమసన్నివేశాలూ, లేక పోవడం కొందరు పాఠకులకు అసంతృప్తి కలిగించి ఉండవచ్చు కాని జీవితాన్ని యథాతథంగానూ, విమర్శనా పూర్వకంగాను అనసూయచేత చెప్పించడంవల్ల అటువంటి సన్నివేశాలు సృష్టించడానికి అవకాశం లేకపోయింది క్షంతవ్యుడ్ని!

ఏది వ్యాఖ్యానించ పుట్టదుట— వాస్తవికరచన చెయ్యడానికి అనుభవమన్నా ఉండాలి దర్శనమన్నా కలగాలి కలలలోకంలో పుట్టిన పాత్రలు కలల్లోనే మిగిలి పోతాయి ఇందులోని పాత్రలన్నీ అతిసన్నవి నాయకులూ, నాయకురాళ్ళూ అనడానికి ఏ అర్హతలూ లేనివి కాని మన ఎదుట ప్రతినిత్యం ఎదురయ్యేవి చిట్టెమ్మ, చెల్లెమ్మ, కనకదుర్గ, సుగుణ, నిర్మల మొదలైన పాత్రలు జీవితమనే యాత్రలో ఎన్నో మజిలీలలో నాకు ఎదురైనవి బరువులు, బాధలు కిమ్మనకుండా మోసి, అనుభవించి ఈ లోకంనించి తప్పుకున్నాయి

ఇంక అనసూయ ఎవరు? సాంప్రదాయాల, ఆచారాల, కులమతవర్గ, వర్ణబేధాల సంకెళ్లలో చిక్కుకున్న మన సమాజంలో, సెకెండ్‌రేట్ సిటిజన్‌గా పరిగణింపబడుతూ, ఎక్కడోతప్ప, కట్నం ఇచ్చుకోనుకుంటేనే కాని భార్య అనే పోస్టుని పొందే అవకాశంలేక, ముఖంమీద క్వెశ్చన్‌మార్క్‌తో నిలబడిపోయిన తెలుగుకన్య! తన, తనచుట్టూ ఉన్న వారినీరసమైన జీవితాన్ని రసవత్తరంగా వినిపించిన అనసూయకి నేను కృతజ్ఞుణ్ణి! ఎందుకంటే అనసూయ అన్నపాత్రచేత మొదటి పేరా నేను పలికించేక ఆమే నన్ను పక్కకినెట్టి కథని చెప్పుక వెళ్ళి పోయింది అటువంటి పాత్ర ఎదురైతే సానుభూతైనా చూపండి.

ఈ నవల ఇద్దరికి అంకితం ఒకరు బతికున్నారు రెండవవారు కీర్తిశేషులు బతికున్న వ్యక్తి నా భార్య లలిత ఇందులో వదినపాత్ర ఆమెకి ప్రతీక

కీర్తిశేషులైన వ్యక్తి ఒకనాటి ప్రముఖ సాహితీవేత్త తెన్నేటి సూరి! ఆయనతో వ్యక్తిగతంగాకాని, కలంద్వారాగాని నాకు పరిచయంలేదు కాని నా రచనలాయన కెందుకో చాలా ఇష్టమై ఉండేవి! అతని ఆత్మకి శాంతి కలుగుగాక

మంధా వెంకటరమణారావు, రచయిత (రూర్కెలా)




### అట్టమీద బొమ్మ-

ముఖచిత్రాలను ఆకర్షణీయంగా ముద్రించుటములో మీరు తీసుకుంటున్న శ్రద్ధకు, నిదర్శనంగా వుంది దీప ముఖచిత్రంతో వెలువడిన 5 8 77 తేదీ పత్రిక, ఆషాడమాసం— బాబోయ్ విరహం కార్టూన్లూ యీ వారం పత్రికకు హైలైట్.

కె. వి రఘురామమూర్తి (హైదరాబాద్.)

### కొత్తవారు? ...

ఉత్తరాలు ఎన్ని వేసినా మా ఉత్తరాలు పత్రికలో వేయక పోవటం క్రొత్తవారికి అవకాశం లేదేమోనని భావిస్తున్నాము అయినా ఉత్తరం వేయకుండా ఉండలేక పోతున్నాను. కథలు చాల బాగుంటున్నవి.

తమసోమా జ్యోతిర్గమయ మా హృదయాలను రంజింప జేస్తున్నది పాపాక్షుని డైరీ కార్టూన్సు గురించి చెప్పనవసరం లేనేలేదు

మాతంగి రాజీప్రభుదాస్, [గుంటూరు.]

### రజనీ ... ?

దీప ముఖచిత్ర కాంతులతో 5 8 77పత్రికతో అందంగా ప్రకాశించింది సినిమా వార్తలలో చిలకమ్మ చెప్పింది చిత్రాన్ని గురించి తెలిపి, రజనీగంధ్ . ల నటన సహజంగా మెచ్చుకునే విధంగా వుందని వ్రాశారు మీరు తెలిపిన నటుని పేరు రజనీగంధ్ కాదు!

యస్ ఏ రహమాన్. [కదిరి]

### ఒక మాదిరి ...

ఈ వారం 5 7 77 ఆంధ్రసచిత్రవారపత్రిక యొక్క ముఖచిత్రం ఒక మాదిరిగా యున్నది. మీకు [జయసుధ]ల వంటి తారల ముఖచిత్రములు దొరకవా ?

పి. సూర్యప్రకాశరావు, [బండాముండా]

### పర్వాలేదు

ఈ వారం 5 8 77 తేదీ ఆంధ్రపత్రికలో ప్రచురించిన కథలలో కెల్లా పరువు—పైకం కథ చాలా బాగా యున్నది రచయితకు నా కృతజ్ఞతలు యిక పోతే సీరియల్స్ పరవాలేదు.

అడ్డాల వెంకటేశ్వరరావు (మోరి)

### ఎట్లా ?...

12,8 77 తేది సంచికలో మరో రచయిత్రి పుట్టింది కథలో పద్మ చేతివ్రాత బాగుండటంవల్ల ఆమెతో ఫెయిర్ కాపీ చేయించే వాడనిరాశారు. మళ్లీ కథ చివర లో పద్మ కథలను తాను ఫెయిర్ కాపీ చేస్తున్నాడని రాశారు మరి ఈయన దస్తూరి బాగుండదు కదా! ఫెయిర్ కాపి ఎట్లా చేస్తారు ?

కె రామారావు, [హైదరాబాదు]




### వీళ్ళు మనుషులే

డాక్టర్ పరచూరి రాజారావ్ వ్రాసిన నవల వీళ్ళూ మనుషులే మా కార్యాలయం చేరింది ముఖచిత్రం మోహన్ ప్రచురణ విశాలాంధ్ర పబ్లిషింగ్ హవుస్, విజయవాడ 4 వెల రు 6 లు.

### వేణీ సంగమం

రచన : శ్రీ రావికంటి వసునందర్, 50 పేజీలు, వెల మూడున్నర రూపాయలు ప్రతులకు ఆంధ్ర సారస్వత పరిషత్తు, తిలక్‌రోడ్, హైదరాబాద్- 1.

### నవత

నటరాజ కళానికేతన్ వేములవాడ వారు ప్రథమ వార్షికోత్సవ సందర్భంగా వెలువర్చిన నవత ప్రత్యేక సంచిక మా కార్యాలయం చేరింది. ఇందులో కరీంనగర్ జిల్లా ప్రముఖుల యువకుల రచనలు గేయాలు పొందుపరిచారు ప్రతులకి నటరాజకళానికేతన్ సాంస్కృతిక సమాఖ్య వేములవాడ వారికి వ్రాయవచ్చును.

### మందారమాల

ఖండకావ్యం, రచన : శ్రీ బి అచ్యుతరాజు, 58 పేజీలు, వెల . మూడు రూపాయిలు, ప్రతులకు ఆనందవర్ధన ప్రచురణలు, 4- 8- 480, గౌలిగూడ, రామమందిరం దగ్గర, హైదరాబాద్- 500 012.

### పూర్ణాహుతి

ఆర్య వైశ్య దంపతుల ఆత్మార్పణగాథ, రచన : శ్రీ ముదివర్తి కొండమాచార్యులు 100 పేజీలు, వెల 6 రూపాయలు ప్రతులకు గ్రంథకర్త పేర గూడూరు, నెల్లూరుజిల్లా అన్న చిరునామాకి వ్రాయాలి

### మాట్లాడిన మానవత

వచన కవితా సంపుటి, రచన మున్నా అచ్యుతరావు, 88 పేజీలు, వెల అయిదు రూపాయిలు ప్రతులకు ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్ రాష్ట్రపతిరోడ్డు, సికింద్రాబాదు.

**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor. S. Radhakrishna**

చేసిన పరీక్షల వలన తెలిందీ...







# రుచికీ, విటమిన్లకూ, పుష్టికీ బిస్కట్ అంటేనే ఇది

బ్రిటానియా

# గ్లూకోజ్-డి



బ్రిటానియా గ్లూకోజ్-డి బిస్కట్లతో పాటు మరో ప్రముఖ బ్రాండ్ గ్లూకోజ్ బిస్కట్లను పోల్చి చూసేందుకు చేసిన పరీక్షల వలన తెలిందేమిటంటే: విటమిన్లు మరియు మొత్తం మీద పుష్టినిచ్చే పదార్థాలు గ్లూకోజ్-డిలో ఎక్కువగా ఉన్నాయని. అంతేగాక రుచికోసం, తియ్యదనం కోసం, కరకరలాడే తనానికి దీనివి కావాలంటారని. శక్తినిచ్చే విషయంలో, గ్లూకోజ్ కన్న గ్లూకోజ్ డి 20% ఎక్కువ శక్తినిస్తుంది!

బ్రిటానియా గ్లూకోజ్-డి-తియ్యటి రుచితో కూడిన శక్తి!




అందుకే మరి ఏ ఇతర గ్లూకోజ్ బిస్కట్ కన్న బ్రిటానియా గ్లూకోజ్-డి అంటేనే ఎక్కువ మంది ఆకర్షితులవుతున్నారు.

బ్రిటానియా బ్రిటానియా బిస్కట్లు అత్యుత్తమమైనవి